తెలుగు మాస పత్రిక

అన్ని గ్రామాలలోనూ, పట్టణాలలోనూ

సమర్థవంతులైన ఏజెంట్లు కావాలి !

ఏజెన్సీ వివరాలకు
వెంటనే రాయండి.

సర్క్యులేషన్ మానేజర్

9, దేశికా రోడ్డు,
మైలాపూరు,
మద్రాసు-600 004






చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1,000.00 |
| జీవిత చందా | 250.00 |
| 3 సంవత్సరాలకు | 52.00 |
| సంవత్సర చందా | 18 00 |
| ఎయిర్ మెయిల్ (1 సంవత్సరం) | 80.00 |
| సీ మెయిల్ (1 సంవత్సరం) | 45.00 |

చందాలు పంపవలసిన చిరునామా :

విస్డమ్
9, దేశికా రోడ్డు, మైలాపూరు,
మద్రాసు-600 004

# ఈ సంచికలో

జూన్ 1984





ముఖచిత్రం-కలర్ ట్రాన్స్‌పరెన్సీ:
శ్రీ ఎస్. కె. సుందరం, మద్రాసు-32.



తెలుగు 'విస్డమ్'కు ఇది మూడవ సంవత్సరం




# నిజమైన ఆచార్యులు



జేమ్స్ ఎలెన్

మానవ జాతిలో వేల సంవత్సరాల కొకడూ, అరా ఆచార్యులు జన్మి స్తారు. నిజమైన ఆచార్యుణ్ణి పట్టి ఇచ్చే అంశం ఆయన జీవించే తీరు. సామా న్యులైన ఇతరుల జీవన విధానంకంటె అది భిన్నంగా ఉంటుంది. ఒక వ్యక్తి నుంచి గాని, ఒక పుస్తకంనుంచి గాని గ్రహించినవి కావు ఆయన బోధనలు! జీవితం నుంచి స్వయంగా గ్రహించిన సత్యాలు అవి. ముందు తాను అచ రించి గాని ఆయన ఏ విషయమూ ఇత రులకు ఉపదేశించడు. లక్షలమంది స్వామీజీలలో ఎవరో ఒక్కరినే ఆచార్యుడుగా మానవజాతి ఆమో దిస్తుంది




# ఎవరు పెద్దమనిషి?



'మనిషి'కి ముందు 'పెద్ద' అనే విశేషణం చేర్చే సరికి అర్థంలో ఎంతో మార్పు వస్తుంది. అయితే — సాధారణంగా 'పెద్ద

## మిక్కిలి పెద్ద రేడియో టెలిస్కోపుతో నూతన వేధశాల

మిక్కిలి పెద్ద రేడియో టెలిస్కోప్‌లు అమర్చిన వేధశాల (observatory) ఒకటి రష్యాలో ఉజ్‌బెకిస్తాన్‌లోని సామర్కండ్ సమీపంలో నిర్మిస్తున్నారు. ఉలుక్ బెక్ అనే గొప్ప ప్రాచీన రష్యన్ ఖగోళ శాస్త్రవేత్త జన్మించిన స్థలంలో ఆయన గౌరవార్థం దీనిని నిర్మిస్తున్నారు కోట్ల సంవత్సరాలకు గాని వాటి కాంతి భూమిని చేరుకోని సుదూర నక్ష త్రాలను కూడా ఈ వేధశాల నుంచి ఖగోళ శాస్త్రజ్ఞులు పరిశీలిస్తారు.

"మనిషికి నాలుక ఒకటే; చెవులు మాత్రం రెండు. దీని అర్థం:
'తక్కువగా మాట్లాడు, ఎక్కువగా విను!' అని!" — అబ్రహామ్ హాస్‌దాయ్

మనిషి' అనే మాటను అంత తీవ్రంగా మనం తీసుకోడం లేదు. అడ్డమైన వారి విషయం లోనూ పదే పదే ఈ మాట వాడుతూ ఉండడం వల్ల అరిగిపోయిన నాణెం లాగ చాలా వరకు ఈ మాట తన పరపతిని కోల్పో యింది. 'తేనె' కూడా రోజూ అదే పనిగా తాగుతూ ఉంటే వెగటనిపిస్తుంది గదా! 'భారత రత్న'లాంటి బిరుదుల ప్రదానం అతి విరళం కావడం వల్లనే వాటి కంత గౌరవం!

అయస్కాంతంలాంటి ఆకర్షణగలవాడు, మృదువుగా, ప్రేమగా ప్రతి మాటను తూచి తూచి మాట్లాడుతూ ఎవ్వరినీ నొప్పించ కుండా ఉండేవాడు, స్వార్థ దృష్టి లేకుండా ప్రజాసేవ చేసేవాడు ధనిక, నిర్ధన భేదాలను గాని, జాతి, వర్ణ భేదాలనుగాని పట్టించుకో కుండా మానవజాతి కంతటికీ సమానంగా మిత్రుడైనవాడు, పరోక్షంలో ఎవ్వరిని గురించిగాని కటువుగా మాట్లాడనివాడు తన చుట్టూ ఉన్న వారిలోని 'మంచి'నే ఎప్పుడూ గ్రహించేవాడు, కష్టంలో ఉన్నవారిని ఆదు కునేవాడు, తనకు జరిగే అన్యాయాలను క్షమించగలవాడు, రాజకీయాలలో, మత విష యాలలో ఎవరి నమ్మకాలు వారు కలిగి ఉండే హక్కు ఉందని ఆమోదించేవాడు 'పెద్దమనిషి' అని నిర్వచించవచ్చును

'పెద్దమనిషి' అనిపించుకోడానికి మనం ఎలాంటి డిగ్రీలూ పొందనక్కరలేదు రైలు స్టేషన్‌లలో పనిచేసే పోర్టర్‌లూ, రోడ్డుమీద నిలబడి ట్రాఫిక్‌ని అదుపుచేసే పోలీసులూ కూడా కావాలంటే తోటివారికి ఎంతో మేలు చేయగలరు. 'పెద్ద మనిషి' అనిపించుకునే

## బొమ్మలలో హాస్యం

### తియ్యని కబుర్లు తెచ్చే ముప్పు




యోగ్యత ధనికులకూ, పేదలకూ, రాజుకీ, చప్రాసీకీ సమంగానే అందుబాటులో ఉంది.

దర్జీ పనిచేసే ఒక సుప్రసిద్ధమైన సంస్థ తమ ప్రతిభను చాటుతూ ఇలా పత్రికలలో ప్రకటించింది: "దేవుడు 'మనిషి'ని సృష్టిం చాడు. మేము 'పెద్ద మనిషి'ని సృష్టి స్తున్నాము." ఆహా! 'పెద్దమనిషి' అనే మాటకు ఎంత చిత్రమైన వ్యాఖ్యానం! మంచి దుస్తులూ, విలువైన వేషమే 'పెద్దమనిషి'ని చేస్తా యని చాలా మంది భావన! కాని అది నిజం కాదు.

తన సుఖం చూసుకోకుండా, విసుగూ విరామం లేకుండా తోటి ప్రజలకు ఆహార ధాన్యాలు పండించడం కోసం పొలాలలో అహర్నిశలూ చెమటోడ్చి పనిచేసే రైతు నిజమైన 'పెదమనిషి!' వెనుకటికి ఎవరో

"వంద ఉదార భావాల కన్న
ఒక్క అందమైన పని మిన్న!" —జేమ్స్ రసెల్ లోవెల్

అన్నారు: "పెద్దమనిషి తేయాకులాంటివాడు. వేడి నీళ్ళలో వేసినప్పుడే తేయాకు అసలు రుచీ, విలువా బయట పడుతాయి:" అని.

నిజమైన 'పెద్దమనిషి' సున్నితమైన స్వభావం కిలిగి, ఆలోచనలలోనూ, చేతలలోనూ ఉదాత్తంగా ప్రవర్తిస్తాడు. తన విశ్వాసాలను అతడు ఎన్నడూ వదలుకోడు: అవసరమైతే వాటి కోసం తన ప్రాణాలు అర్పిస్తాడు. తనకు ఏ విధంగానూ ఉపయోగపడని వారిని కూడా అతడు ఆదరిస్తాడు. ఎవరికీ చిరాకు కలిగించకుండా అందరికీ తలలో నాలుక లాగ పనులు కుంటాడు. ఎవరేది చెప్పినా చెయ్యకపోయినా, ఎవరి మనస్సునూ నొప్పించడు. ఐశ్వర్యానికి అతడు దూరం కావచ్చు; కాని వివేకానికి మాత్రం ఎన్నడూ దూరం కాడు. అతడు దివాళా తీయవచ్చు; అయినా గౌరవం కోల్పోడు. ఎన్ని కఠిన పరీక్షలు ఎదురైనా, అన్నిటికీ తట్టుకొని నిజమైన వీరుడుగా నిలుస్తాడు. 'గెడ్రోసియా' ఎడారిలో దప్పికతో అలమటిస్తూ కూడా అలెగ్జాండరు అక్కడ ఉన్న అందరికీ చాలవనే కారణంతో అనుచరులు తెచ్చిన నీటిని త్రాగడానికి నిరాకరించాడు. సర్ ఫిలిప్ పిడ్నీ తీవ్రంగా గాయపడి కూడా ఎవరో తన కందించిన గ్లాసెడు నీళ్ళను "నా అవసరంకంటె నీ అవసరం గొప్పది" అంటూ తనకంటె తీవ్రంగా గాయపడిన పక్క సైనికుడికి దానం చేశాడు.

మీలో ప్రతి ఒక్కరూ 'పెద్ద మనుషు'లు అనదగిన మిత్రులు మీకు ఎంతమంది ఉన్నారో లెక్కవేసి చూడండి. అలాంటివారిని మీ వేళ్ళమీద లెక్కించడానికి మీరు నానా అవస్థా పడవలసి రావచ్చు. లేకపోతే 'డయోజనీస్' లాగ పట్టపగలే లాంతరు చేత బుచ్చుకుని 'పెద్దమనుషుల'ను వెదుకుతూ బయలుదేరవలసి రావచ్చు!

ఈ రోజులలో చాలా పట్టాలనూ, బిరుదులనూ కష్టపడి సంపాదించడానికి బదులు డబ్బుపెట్టి కొనుక్కోడం జరుగుతూంది. ఉత్తుత్తి గౌరవాలకోసమే నేడు మనుష్యులు జీవిస్తున్నారు; మరణిస్తున్నారు.

చాలామంది నిజంగా తమకు యోగ్యత లేని గౌరవాలతో కులుకుతున్నారు. ముఖం, దుస్తులూ మనిషి మనస్సుకీ, హృదయానికీ దర్పణాలు అనే మాట అన్ని సందర్భాలలోనూ నిజం కాదు. ఒకప్పుడు ఒక వ్యక్తిని చూసి అతడు 'పెద్దమనిషి' అని మీరు

(మిగతా 64వ పేజీలో)

## ఇండియాలో రైళ్ల చాకచక్యం



ఇండియాలో రోజూ ఒక కోటి మంది ప్రయాణికులనూ, 70 లక్షల టన్నుల సరుకులనూ మొత్తం 11,000 రైలు బళ్ళు 7,000 పైచిలుకు స్టేషన్‌లకు చేరవేస్తున్నాయి. రోజూ అవి 13 లక్షల కి.మీ.ల దూరం నడుస్తున్నాయి.

"పాపి తనకే హాని కలిగించుకుంటాడు:
అన్యాయపరుడు తనకే అన్యాయం చేసుకుంటాడు!" -మార్కస్ అరీలియస్

# చిట్టిదేవతలకు చిన్న కథలు

## అర్థంలేని వివాదాలు

స్వామి రామతీర్థ

ముగ్గురు కుర్రవాళ్ళకు వాళ్ళ యజమాని ఒక నాణెం కానుకగా ఇచ్చి, దానిని ముగ్గురూ సరి సమానంగా పంచుకోమ్మన్నాడు. ఆ నాణెంతో ఏదైనా వస్తువు



కొని దానిలో ముగ్గురూ మూడు భాగాలు తీసుకోవాలి అని వారు అనుకున్నారు. వారిలో ఒకడు ఇంగ్లీషువాడు, ఒకడు హిందువు, మూడోవాడు పర్షియన్. ముగ్గురికీ ఒకరి భాష ఒకరికి అర్థం కాదు. అందుచేత నాణెంతో ఏం కొనాలో నిర్ణయించుకోడం కష్టమయింది. ఇంగ్లీష్ కుర్రాడు 'వాటర్ మెలాన్' కొందామన్నాడు. హిందువు 'అలా వీల్లేదు నాకు హిందువానా కావాలి!' అన్నాడు. పర్షియన్ 'అదేం కుదరదు, కొందా' మన్నాడు. వాళ్ళల్లో ఏకాభిప్రాయం కుదురలేదు. ప్రతివాడూ తను చెప్పిందే కొనాలని పట్టుబడుతున్నాడు. ఇలా వాదించుకుంటూ

### ముఖచిత్ర వ్యాఖ్య

(ఏప్రిల్ 1984)

"స్వామీ! ఏడు కొండలవాడా!
నీవే రక్షించాలి ఈ ఆంధ్రరాష్ట్రాన్ని!"
—పి. శ్రీనివాసరెడ్డి, వరంగల్.

* * *

"కలియుగ దేవా!
కాపాడ రావా?"
—ఏ. వి. ఎస్. ఎస్. శర్మ, అనకాపల్లి.

* * *

"తిరుమల తిరుపతి వేంకటేశ్వరా!
'విస్డమ్' బహుమతి నొసగుమయా!".
—బి. వి. యల్. నారాయణరావు,
గుంటూరు.

"మన లక్ష్యం దేశం, మొత్తం దేశం;
దేశం తప్ప ఇంకోటి కాదు!" —డేనియల్ వెబ్స్టర్

ముగ్గురూ వీధిలో నడుస్తూ ఉండగా ఆ ముగ్గురి భాషలూ—ఇంగ్లీషు, హిందుస్తానీ, పర్షియన్—తెలిసిన ఒక పెద్దమనిషి వారికి ఎదు రయాడు.

ఏ విషయమై వారు తగాదా పడుతున్నారో తెలిసికొన్న ఆ పెద్ద విస్తుపోయాడు. వాళ్ళు ఒప్పుకుంటే వారి తగాదాను తాను పరిష్కరిస్తా నన్నాడు. ముగ్గురూ ఏకగ్రీవంగా అతనిని మధ్యవర్తిగా అంగీకరించారు. వారి వద్ద నాణెం తీసుకుని ఆ మధ్యవర్తి బజారుకి వెళ్ళి ఒక పెద్ద పుచ్చకాయ కొనుక్కొచ్చాడు. వాళ్ళకు కనిపించకుండా దానిని ఒక గదిలోకి తీసుకువెళ్ళి 3 సమానమైన ముక్కలుగా కోశాడు. ముందుగా ఇంగ్లీషు బాలుని లోపలికి పిలిచి "నీకు కాలసింది వాటర్ మెలాన్ కదా! ఇదిగో నీ వాటర్ మెలాన్!" అంటూ ఒక ముక్క అతనికి ఇచ్చాడు. తన మాటే సాగి నందుకు సంతోషపడి అతను వెళ్ళిపోయాడు. తరువాత హిందువును పిలిచి, "ఇదిగో నీ హిండ్‌వానా!" అని మరో ముక్క అతనికి ఇచ్చాడు. తను కోరుకున్నదే మధ్యవర్తి కొన్నందుకు అతడూ పొంగిపోయాడు. అనంతరం పర్షియన్‌ను పిలిచి "నీకు కావలసింది తర్బూజ్ కదా! ఇదిగో తీసుకో!" అంటూ మూడో ముక్క అందించాడు. వెను కటి ఇద్దరి లాగే అతనూ పరమానంద పడాడు.

ఆ ముగ్గురు కోరుకున్నదీ నిజానికి ఒకే వస్తువు. అయినా వారి మధ్య వివాదం ఎందుకొచ్చింది? ఒకరి భాష ఒకరికి తెలియక పోవడం వల్ల వచ్చింది. ఒకే వస్తువుకి మూడు భాషలలోనూ మూడు వేరు వేరు పేర్లు ఉండడం వల్ల వచ్చింది. సరిగ్గా ఈ కుర్ర వాళ్ళ లాగానే ఈ నాడు వివిధ మతాలవారు ఒకరితో ఒకరు కలహానికి దిగడం జరుగు తూంది.

—('కామకోటి వాణి' సౌజన్యంతో)

---

## ప్రపంచంలో మిక్కిలి పొడగరి



రాబర్ట్ పెర్షింగ్ వాడ్‌లో 1918 ఫిబ్రవరి 22 న ఇలినాయిస్ రాష్ట్రంలోని ఆల్టన్‌లో 8½ పౌన్లు బరువు గల సాధారణ శిశువుగానే జన్మించాడు. కాని రోజులు గడుస్తున్న కొద్దీ విపరీతంగా పొడుగు ఎదుగ సాగాడు. 5 వ ఏట 5′ 4″, 10 వ ఏట 6′ 5″, 14 వ ఏట 7′ 5″, 18 వ ఏట 8′ 3½″ ఉన్నాడు. అక్కడికీ పెరగడం ఆగలేదు. 22 వ ఏట ఇన్‌ఫ్లూయెంజా జ్వరంతో అతడు మరణించే నాటికి అతని ఎత్తు 8′ 11.1″; బరువు 439 పౌన్లు!

"భూలోకంలో 'నరకం' చూడా లంటే
ఏడుపు గొట్టువాని హృదయంలోకి చూడు!" —బర్టన్



రాఘవేంద్ర రావు

ప్రపంచ రికార్డులను నమోదు చేసిన 'గిన్నెస్ బుక్'లోని 15,000 ఎంట్రీలలో దాదాపు రెండు డజన్ల దాకా ఇండియాకూ, ఇండియన్లకూ సంబంధించినవి ఉన్నాయి. 'గిన్నెస్ బుక్' తాలూకు 1983వ సం. రపు ఎడిషన్ ననుసరించి ఈ క్రింది వివరాలు సేకరించబడ్డాయి.





* ప్రపంచంలో జరిగిన మిక్కిలి విస్తృతమైన ఎన్నికలు 529 మంది సభ్యులతో కూడిన ఇండియన్ పార్లమెంట్ ఎన్నికలు!

* మిక్కిలి గొప్ప మెజారిటీతో ఎన్నికైన అభ్యర్థి రామ్‌విలాస్ పశ్వాన్. 1977 మార్చినెలలో జరిగిన ఎన్నికలలో బీహార్‌లోని హాజీపూర్ నియోజక వర్గంలోని మొత్తం 6,25,179 వోట్లలోనూ 4,24,545 వోట్లు జనతా పార్టీ అభ్యర్థి అయిన పశ్వాన్‌కు వచ్చాయి.

* ప్రపంచంలో విడి ఆవాస గృహాల సం॥ మిక్కిలి ఎక్కువగా ఉన్న దేశం ఇండియా. 1972 లో ఇక్కడ 10,02,51,000 ఇళ్ళు ఉన్నాయి.

* మిక్కిలి ఎత్తైన ప్రదేశంలో నిర్మించబడిన ఇళ్ళుకూడా ఇండియాలోనే ఉన్నాయి. టిబెట్ సరిహద్దు సమీపంలోని బసీసీలో సముద్ర మట్టానికి 19,700 అ. ల ఎత్తున ఇళ్ళు నిర్మించబడ్డాయి.

* ఎక్కువ హత్యలు చేసిన హంతకుని విషయంలో కూడా ఇండియాదే రికార్డు! 'బుహ్రాన్' అనే థగ్ 1790 మొదలు 1840 వరకూ జౌద్ సమీపంలో మొత్తం 931 మందిని పీకె పిసికి వధించినట్టు స్వయంగా అంగీకరించాడు. మనుష్యులను తిన మరిగిన 'చంపావత్' పెద్దపులి-1907 లో కర్నల్ జిమ్ కార్బెట్ చేత కాల్చి వేయబడింది - కేవలం 436 మందినే తను పొట్టను బెట్టుకుంది!

"డబ్బు దగ్గిరికి వస్తే అందరి మతం ఒక్కటే!" —వోల్టేర్



* ప్రపంచంలో ఉత్సవ సమయంలో ఒకచోట సమావేశం అయిన మిక్కిలి పెద్ద గుంపు 1977 జనవరి 19 న అలహాబాద్ లో జరిగిన కుంభమేళ సందర్భంలో అని రికార్డ్ అయింది. ఆ ఏడు 1.27 కోట్ల మంది ఆ ఉత్సవానికి వచ్చారు.

* సుదీర్ఘ కాలం కొనసాగిన కోర్టు కేసు ఇండియాలోనే నమోదయింది. 1205 లో మాలోజీ తోరత్ దాఖలు చేసిన దావాలో 761 ఏళ్ళ అనంతరం 1966 ఏప్రిల్ 28 న 'పూనె' లో మాలోజీ వంశీకుడు బాలా సాహెబ్ పట్లోజీ తోరత్‌కు అనుకూలంగా తీర్పు చెప్పారు. మత సంబంధమైన ఉత్స వాలలో జరిపే మర్యాదలకు సంబంధించిన తగాదా అది!

* ప్రపంచంలో మిక్కిలి పొడవున్న రైల్వే ప్లాట్‌ఫారం ఇండియాలోనే ఉంది. అది ఖరగ్‌పూర్ స్టేషన్ ప్లాట్‌ఫారం. దాని పొడవు: 2,733 అ డు.

* మిక్కిలి దారుణమైన రైలు ప్రమాదం కూడా ఇండియాలోనే జరిగింది. 1981 జూన్ 6 న బీహార్‌లో ఒక రైలు భాగ్మతీ నదిలో పడిపోయి, 800 మంది పైచిలుకు మరణించారు.

* కరువు, కాటకాల విషయంలో కూడా ఇండియాదే అగ్ర తాంబూలం. 1770 లో వచ్చిన బ్రహ్మాండమైన కరువు సందర్భంలో ఒక్క బెంగాల్‌లోనే కోటిమంది జనం మర ణించా రని అంచనా!

* ఇండియా ప్రపంచ రికార్డును స్థాపిం చిన మరొక ఉపద్రవం 1979 ఆగస్టు 1 న 'మోర్వీ' డామ్‌కి గండి పడడం. సుమారు 5,000 మంది ఆ సందర్భంలో మరణించారు.

* మిక్కిలి దారుణమైన వడగళ్ళ వాన ఇండియాలోనే కురిసింది. 1888 ఏప్రిల్ 2 న మొరాదాబాద్‌లో జరిగిన ఆ దుస్సంఘట నలో 246 మంది హతు లయారు.



* మీకు తెలుసో, తెలియదో - ఢిల్లీలోని మన కుతుబ్‌మీనార్ ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన, ఎలాంటి ఆధారాలూ లేని రాతి కట్టడం. దీని ఎత్తు 238 అ.లు. 1194 లో ఇది నిర్మించబడింది.

* గణిత శాస్త్ర ప్రావీణ్యంలో ప్రపంచ

(మిగతా 57 వ పేజీలో)

"తాను హాని చేసిన వారి మీద ద్వేషం ఉండడం మానవ నైజం!" -టాసిటస్

# ప్రపంచ వింతలు

## నయాగరా [illegible]

రాఘవేంద్ర రావు




"ఈ సృష్టిలో దానికి అదే సాటి!" అన్నాడు, నయాగరా జలపాతాన్ని 1678 లో మొట్టమొదట సందర్శించిన ఫ్రెంచ్ నూతన ఖండాన్వేషకుడు (explorer) రాబర్ట్ డీ లాసలె.

ఆయన వర్ణనలో స్వల్పంగా అతిశయోక్తి ఉంటే ఉండవచ్చును. ఎందుకంటే - రెండో కొసను సుప్రసిద్ధ ఐరిష్ రచయిత ఆస్కార్ వైల్డ్ నయాగరా జలపాతాన్ని ఇలా నిరసిస్తాడు: "పెద్ద మొత్తంలో నీరు ఎవరికీ ఉపయోగ పడకుండా అపమార్గంలో వ్యర్థమై పోతున్న దృశ్యమే ఈ నయాగరా!"

"అయినా - ఇది అత్యద్భుత మైన దృశ్యం అని మీరు ఒప్పుకోరా?" అని ఆయనను నిగ్గ తీశాడు ఒక పత్రికా విలేఖకుడు.

"నీరు అలా క్రింద పడిపోకుండా అక్కడే ఆగిపోయి ఉంటే - అప్పుడు అది అత్యద్భుతమైన దృశ్యం అయేది!" అన్నారు - ఆస్కార్ వైల్డ్.

ఆస్కార్ వైల్డ్ లాంటి వారు ఎలా అభిప్రాయ పడ్డా, సుమారు గత 180 ఏళ్ళుగా నయాగరా జలపాతం అంతర్జాతీయమైన ఆకర్షణ అయింది. ప్రస్తుతం 60 లక్షల మంది దాకా వచ్చి ఏటేటా ఈ జలపాతాన్ని సందర్శించి పోతున్నారు. టూరిస్ల కోసం వేసిన

---

## సీసా సందేశాల ద్వారా ప్రేయసిని పొందిన ఇటాలియన్!

అంటోనియో ఫ్రాంచీ తనకు ఒక ప్రేయసి కావా లంటూ తన వివరా లన్నీ వ్రాసిన లేఖను 1,282 కాపీలు తీయించి, వాటిని సీసాలలో పెట్టి మధ్యధరా సముద్రంలో వదిలాడు. ఫలితంగా కొద్ది నెలలలోనే అన్నా పీట్రో అనే ప్రేయసి అతడికి లభించింది.

---

కరపత్రం సగర్వంగా ఈ జలపాతాన్ని 'ప్రపంచంలో సుప్రసిద్ధమైన అడ్రస్సు' అని వర్ణిస్తూంది.

క్రిందటేడు ఆగస్ట్ నెలలో ఉల్లాసకరమైన ఒక ఉదయం పూట 'టొరాంటో' నగర పరిసరాల నుంచి 130 కిలోమీటర్ల దూరంలో ఉన్న నయాగరా జలపాతం చూడడానికి 'క్వీన్ ఎలిజబెత్ వే' రోడ్డు మీదుగా కార్లో మేము బయలు దేరాము. సుప్రసిద్ధమైన ఆ రోడ్డుమీద



పోతూంటే ముందుగా ఓక్‌విలే, స్టోనీ క్రీక్, బర్లింగ్‌టన్ అనే అందమైన చిన్న చిన్న పట్టణాలు తగులుతాయి. ఆ తరువాత కెనడా తాలూకు పల్లెపట్టులూ, వ్యవసాయ క్షేత్రాలూ, పీచ్, చెర్రీ, ద్రాక్ష పళ్ళ తోటలూ కనులకు విందు చేస్తాయి.

గంటన్నరలో మేము 'జగత్ ప్రసిద్ధమైన ఆ అడ్రసు'ను చేరుకున్నాము. అవాళ సెలవు రోజు కాకపోయినా కార్లు చీమల బారుల్లాగ 'పార్క్' చేసి ఉన్నాయి. మా కారును 'పార్క్' చేసేందుకు తగిన స్థలం ఆన్వేషించడానికి మరో అరగంట పట్టింది. ఆ నయాగరా పట్టణంలో ఎక్కడ చూసినా రంగు రంగుల టీ షర్ట్‌ల లాంటి తేలిక వేసవి దుస్తులు ధరించి చేతిలో కెమేరాలతో టూరిస్టులు తండోపతండాలుగా మాకు ఎదురయారు.

మొట్ట మొదటిసారి ఆ జలపాతాన్ని దర్శించిన క్షణం నిజంగా మనం నిర్ఘాంతపోతాము. ఆకుపచ్చని నురగలు కక్కుతూ గుర్రపునాడా ఆకారంలో ఉన్న ఒక కొండ అంచుమీద నుంచి పిడుగులు పడుతున్నంత హోరుతో తెల్లని పొగమంచు లాంటి నీటి తుంపరలను పైకి ఎగజిమ్ముతూ నీరు క్రిందపడే ఆ దృశ్యం మన కళ్ళు చెదరగొడుతుంది.

మీకు లెక్కలూ, వివరాలూ కావాలంటే.. సెకనుకి 2 లక్షల ఘ.అ. ల నీరు, లేదా నిముషానికి 3.5 కోట్ల గాలన్ల నీరు కొండ అంచుమీద నుంచి అఖాతమైన ఆ లోయలోకి పడుతూంది. అలా పడుతూ కనిపించే ఆ నీరంతా 'ఈరీ' సరస్సు నుంచి నయాగరా నది ద్వారా ప్రవహించి వస్తుంది. హోరుమని చప్పుడు చేస్తూ అ విధంగా ఆ లోయలో పడిన నీరు మెలికెలు తిరుగుతూ పారి చివరికి

## ప్రీతీష్ నందీకి 1984 ఫార్‌స్టర్ అవార్డ్

'ఇలస్ట్రేటెడ్ వీక్లీ అఫ్ ఇండియా' ప్రస్తుత సంపాదకుడు శ్రీ ప్రీతీష్ నందీకి 1984 ఇ.ఎమ్. ఫార్‌స్టర్ అవార్డు ఇస్తున్నట్టు ప్రకటించారు. కవిగా, అనువాదకుడుగా, విమర్శకుడుగా, సంపాదకుడుగా ఆయన విశిష్ట ప్రతిభకు గుర్తింపు ఈ అవార్డ్.

"'అసమగ్రత' కు కన్నతల్లి 'తొందర'!" -బ్రెజిల్ సామెత

'ఒంటారియో' సరస్సులో కలుస్తుంది. విస్తీర్ణంలో ఆ 'ఒంటారియో' సరస్సు ప్రపంచంలోని సరస్సులలో 14 వది.

ప్రపంచం అంతటిలోకీ మిక్కిలి ఎత్తైన జలపాతం అయిన వెనిజులాలోని 3,212 అ. ల ఎత్తునుంచి పడే - 'ఏంజెల్' జలపాతంతో పోల్చి చూస్తే నయాగరా జలపాతం 'మరుగుజ్జు' అనవచ్చును. కెనడా వైపున ఉన్న 'హార్స్-షూ' జలపాతం కేవలం 186 అ. ల ఎత్తు, 2,500 అ. ల వెడల్పు కలది. అమెరికా వైపున ఈ జలపాతం ఎత్తు 193 అ. లు, వెడల్పు 1,000 అ. లు. ప్రపంచంలో ఇంతకంటె ఎత్తైనవీ. వెడల్పైనవీ జలపాతాలు ఎన్నో ఉన్నా వాటికి నయాగరా జలపాతం అంత ప్రశస్తి రాలేదు. అడపా దడపా కొందరు విచిత్ర వ్యక్తులు ఒక పీపాలో దూరి జలపాతం మీదుగా క్రిందికి దొర్లడం, జలపాతం పైన ఎత్తుగా ఈ చివర నుంచి ఆ చివరికి ఒక తీగె కట్టి దానిమీద నడవడం లాంటి



నయాగరా జలపాతాన్ని
తిలకిస్తున్న టూరిస్ట్లు

ఫీట్లు చేసి ఈ జలపాతానికి మరింత ప్రచారం కలిగిస్తున్నారు.

అలా తీగె మీద నడిచిన వారిలో మిక్కిలి ప్రముఖుడు ఫ్రాన్స్ తాలూకు జీన్ ఫ్రాంకోయిస్ గ్రావెలెట్ (1824-97) అనే చార్లెస్ బ్లాండిన్. జలపాతం పైన 160 అ. ల ఎత్తున 3 అం. ల వెడల్పు గల త్రాటిమీద 1,100 అ. ల దూరం నడిచి బ్లాండిన్ 1859 జూన్ 30 న నయాగరా జలపాతం దాటాడు. ఆ తరువాతి సంవత్సరం తన ఏజంట్ అయిన హారీ కాల్కార్డ్ని వీపు మీద ఎక్కించుకుని మళ్ళీ బ్లాండిన్ ఆ జలపాతాన్ని దాటాడు.

తగినంత డబ్బు చేతిలో ఉండాలే గాని ఈ జలపాతాన్ని 12 వేర్వేరు కోణాల నుంచి మనం దర్శించవచ్చును. కన్ను చెదరగొట్టేటంత అద్భుతమైన ఆ పరిసరాల మొత్తం దృశ్యాన్ని చూడాలంటే 520 అ. ల ఎత్తున్న స్కైలాన్ టవర్ ఎక్కి, దాని మీద నుంచి చూడాలి. లేదా 'పాన్ ఎయిర్ హెలికాప్టర్ లిమిటెడ్' వారు నడుపుతున్న హెలి

---

## పాఠకుల అభిప్రాయాలు

(ఏప్రిల్ 1984)

★

"భూమికి ఆకర్షణ శక్తి ఉందంటారు—
మరి ఆకాశాన్నంటే ధరలను అది
క్రిందికి ఆకర్షించదేం?"

—హెచ్. ఫణి, అనంతపురం.

* * *

"ఉన్నవాడు అడుక్కుంటే అప్పు!
లేనివాడు అడుక్కుంటే ముష్టి!"

—సుందరగిరి విజయ్ ప్రసాద్, వరంగల్.

"ఒక్క సంతోషం వంద విచారాలను తరిమికొడుతుంది." —చైనా సామెత

కాప్టర్ ఎక్కి విహంగావలోకనం చేయవచ్చు. కొందరికి క్రింది భాగం నుంచి ఆ జలపాతాన్ని చూడాలనే సరదా ఉండవచ్చును. ఆ దృశ్యం చూడాలంటే ఇంచుమించు జలపాతం పాదం దరిదాపులదాకా తీసుకుని వెళ్ళి చూపించే లాంచ్ మీద ప్రయాణం చెయ్యాలి. అక్కడికి మీకు తృప్తి కలుగకపోతే జలపాతం పైన తీగెలమీద నడిచే స్పానిష్ ఏరో కార్‌లో పోయి ఆ మనోహర దృశ్యం తిలకించవచ్చును.

నయాగరా పట్టణంలో మీకు కనిపించే వింత అక్కడి జలపాతం ఒక్కటే కాదు. సరదాగా వచ్చే వినోదయాత్రికులూ, వివాహం అయిన కొత్తలలో విహార యాత్రలకు బయలుదేరిన కొత్త జంటలూ చూడదగిన విచిత్రాలు దాదాపు 100 దాకా అక్కడ ఉన్నాయి. అక్కడి 'మెరీన్ లాండ్'లో అద్భుతమైన ఫీట్‌లు చేస్తూ అందరికీ వినోదం కలిగించే రాకాసి తిమింగిలాలను (giant killer whales) చూడవచ్చును. లేదా డ్రేగన్ పర్వతం అంచుమీద గొప్ప 'థ్రిల్' కల్గిస్తూ ప్రయాణించే 'రోలర్ కోస్టర్' రైలు ఎక్కవచ్చును. మ్యూజియమ్‌లు చూడాలనుకునే వారికి ది నయాగరా ఫాల్స్ మ్యూజియమ్', 'ది రిప్లేస్ బిలీవ్ ఇట్ ఆర్ నాట్ మ్యూజియమ్', 'గిన్నెస్ మ్యూజియమ్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్', 'ఎల్విస్ ప్రెస్లీ మ్యూజియమ్' లాంటి ఎన్నో మ్యూజియమ్‌లు నయాగరాలో ఉన్నాయి. చివర చెప్పిన మ్యూజియమ్‌లో కీర్తిశేషుడైన సుప్రసిద్ధ 'గాయక నటుని' తాలూకు 10 లక్షల డాలర్లు ఖరీదు చేసే కాడిలాక్ కారూ, 75,000 డాలర్లు ఖరీదు చేసే వజ్రాలు పొదిగిన చేతి గడియారం ప్రదర్శించబడుతున్నాయి.

చరిత్ర ప్రియులైనవారు కారులో చేరువలో ఉన్న 'యంగ్స్ టౌన్'కి వెళ్ళి రావచ్చును. అక్కడి నయాగరా కోటలో 1726 నుంచి 1812 వరకూ ఆ ప్రాంతాలలో జరిగిన యుద్ధాలన్నిటి వివరాలనూ ప్రదర్శిస్తున్నారు. 'కాక్‌టెయిల్' పానీయానికి మొదట ఆ పేరు రావడానికి కారణమైన సంఘటన

(మిగతా 49 వ పేజీలో)

## కొత్తరకం సౌరవిద్యుద్ యంత్రం



సౌరశక్తిని 1,000 రెట్లు పెంచగల ఒక కొత్తరకం సౌర విద్యుదుత్పాదక యంత్రం నమోనాను పశ్చిమ జర్మనీలోని 'లోరక్'లో ఉన్న బోమిన్ సోలార్ కంపెనీ తయారు చేసింది. మామూలు యంత్రాల బరువులో 10వ వంతు మాత్రమే ఉండే ఈ యంత్రానికి గాలి నుంచీ, ధూళినుంచీ రక్షణ కల్పించే కవచం ఉంది. ఈ యంత్రాన్ని మొదట ఆఫ్రికాలోనూ, ఆసియాలోనూ నెలకొల్పుతారు.

"జబ్బు చేసినప్పుడు గాని ఆరోగ్యం విలువ మనకు తెలియదు."

# నవ్వు

## చావుకు కారణం:

యువకుడైన ఒక డాక్టర్ ఇంటికి వస్తూనే భార్యతో "ఇవాళ ఘోరమైన పొరపాటు చేశానే!" అన్నాడు.

అదుర్దాగా అడిగింది

"ఒక డెత్ సర్టిఫికెట్ మీగ తొందరలో పొరపాటున 'చావుకు కారణం' వ్రాయవలసి ఉన్నచోట నేను సంతకం చేసేశాను!"

* * *

## పుస్తకాలు చెల్లేందుకు సులభోపాయం:

ఫ్రాన్స్‌లోని 'నైస్' నగరం నుంచి వచ్చే ఒక దిన పత్రికలో ఒక రోజు ఒక ప్రకటన వెలువడింది:

"యువకుడూ, రూపసీ అయిన ఫలానా కోటీశ్వరుడు 'వి....' గారు వ్రాసిన ఫలానా నవలలోని నాయిక వంటి అమ్మాయిని వివాహ మాడా లనుకుంటున్నారు. అలాంటి లక్షణాలు గల అమ్మాయిలు వెంటనే వచ్చి ఆయనను కలసి మాట్లాడవచ్చును."

ఆ ప్రకటన వెలువడిన 20 గంటల లోగా 'వి....' గారు వ్రాసిన ఆ ఫలానా నవల ప్రతులన్నీ చెల్లిపోయాయి.

## విజ్ఞాన తృష్ణ:

టీచర్: మీ వాడికి విజ్ఞాన తృష్ణ బాగా ఎక్కువండీ!

తల్లి: మరేనండి-మా వాడికి నా 'విజ్ఞానం', వాళ్ళ నాన్నగారి 'విజ్ఞాన తృష్ణా' వచ్చా యండీ!

* * *

(మిగతా 14 వ పేజీలో)

## నీటిమీద దిగి అక్కడి నుంచే మళ్ళీ ఎగిరే విమానం



'డి ఓ. 24 టి.టి.' అనే నీటి మీద దిగి, నీటిమీద నుంచే మళ్ళీ పైకి ఎగురగల కొత్త రకం విమానాన్ని ప్రస్తుతం బాల్టిక్ సముద్రంలో పరీక్షిస్తున్నారు. గంటకు 400 కి.మీ. ల దాకా వేగంతో ఇది ఎగుర గలదట!

"గౌరవాలు పొందడం కాదు గొప్ప - వాటికి తగిన అర్హత సాధించడం గొప్ప!"

# ఎందుకు?

## వాన నీరు ఉప్పగా ఎందుకు ఉండదు?



ఉప్పునీరు ఉప్పగా ఉండడానికి కారణం వర్షం రూపంలో ఆ నీరు భూమి మీద పడింది మొదలు మన ఉపయోగం కోసం మన ఇళ్ళకు తెచ్చుకునే లోగా దానిలో ఎన్నెన్నో ఖనిజ లవణాలు కలియడం. నిజానికి నీటి ఉప్పదనం నేలలో నుంచి వస్తుంది. సుద్దనేలలోని నీరు మరీ ఉప్పగా ఉంటుంది.

వాన నీరు నిజానికి బట్టీ పట్టిన నీరు లాంటిది. అంత స్వచ్ఛంగా ఉంటుంది. నదులు, సముద్రాలు, సరస్సుల లోని నీరు ఆవిరిగా మారేటప్పుడు ఆ ఆవిరిలో ఆ నీటిలోని ఖనిజ లవణా లేవీ చేరవు. పొగమంచు గుండా వాన పడితే తప్పు, లేకపోతే సాధారణంగా ఆ నీరు మిక్కిలి స్వచ్ఛంగా ఉంటుంది. ఉప్పు నీరుగా మారే అవకాశం దానికి లేదు.

---

(13 వ పేజీ తరువాయి)

## 'నా ఆరోగ్యానికి కీలకం...!'

"ఇంత వృద్ధాప్యంలో కూడా మీ రింత దృఢంగానూ, ఆరోగ్యంగానూ ఉండ గలగడంలో రహస్యం ఏమి టంటారు?" అడిగాడు ఒక శతవృద్ధును ఒక యువకుడు.

క్షణం సేపు ఆయన తీవ్రంగా ఆలోచించి, ఇలా అన్నాడు: "బహుశః వ్యాధులను కలిగించే సూక్ష్మ క్రిములను కనిపెట్టక ముందే నేను పుట్టి ఉండడం అందుకు కారణం కావచ్చు!"

* * *

## కావ్యాస్వాదనః

కొత్తగా వెలువడిన ఒక కావ్యం మంచి చెడ్డలను గురించి ఇద్దరు యువకులు తీవ్రంగా వాదించుకుంటున్నారు. వారిలో స్వయంగా కవిత్వం వ్రాసే యువకుడు రెండో వాడితో అన్నాడు: "ఒక్క పద్యం అయినా నువ్వెప్పుడూ గిలికిన పాపాన పోలేదు. ఆ కావ్యంలోని రుచి నీ కెలా తెలుస్తుందిరా!"

రెండోవాడు తడుముకోకుండా ఇలా జవాబు చెప్పాడు: "నే నెప్పుడూ ఏ కోడి గుడ్డునూ పొదుగలేదు — నిజమే! అయినా గుడ్లను పొదిగే ఆ కోడిపెట్టల కంటె ఆమ్లెట్ రుచి నాకే బాగా తెలుసు!"

"ఆత్మను నరక ద్వారానికి చేర్చే త్రోవలు మూడు: కామం, క్రోధం, దురాశ" —భగవద్గీత

# ముక్కుకు గాలిపడపోత సాధనం

డా॥ జె. ఎస్. పశ్రీచా



[పంజాబ్‌లోని 'బంగా'లో 1938 మార్చి 13 న జన్మించిన శ్రీ పశ్రీచా పంజాబ్ యూనివర్సిటీ నుంచి ఎం.బి.బి.యస్. డాక్టర్ పట్టా అందుకున్నారు. 1968 లో 'చర్మవ్యాధుల చికిత్స' (dermato logy)లో పిహెచ్.డి. తీసుకున్నారు. ప్రస్తుతం న్యూఢిల్లీలోని 'ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్'లో చర్మవ్యాధులకూ, సుఖ వ్యాధులకూ సంబంధించిన విభాగంలో అసోసియేట్ ప్రొఫెసర్.]

'అలెర్జీ' లకు సంబంధించిన ఒక విశేషం ఏమిటంటే - రోగి తన 'అలెర్జీ'కి కారణం ఏమిటో తెలుసుకుని దానిని పరిహరించిన మరుక్షణం ఇంకే వైద్యం అక్కర లేకుండానే రోగం దానంతట అదే నివారణ అవుతుంది.

కొన్ని రకాల 'ఉబ్బసం', 'రైనిటిస్' (ముక్కు వాచి, దిబ్బడివేసి సీరుకారుతూ ఉండే హే ఫీవర్), దురదలు, దద్దుర్లు (witicaria), 'అటోపిక్ డెర్మటైటిస్' (మోచేతుల ముడతలలోనూ, మోకాళ్ళ ముడతలలోనూ, మెడ క్రిందా, చర్మం మందంగా అయి నల్లబడడం, దురదలు), 'పాంఫోలిక్స్' (అర చేతులలోనూ, మడమల మీదా దురద

---

## భావ పరిచయ పోటీ

(ఏప్రిల్ 1984)



"పాప మంటే లేదు భీతి
ప్రాణ మంటే కడు ప్రీతి॥"
—చలసాని సత్యనారాయణ, ఏలూరు.

* * *

"ఎవరి ప్రాణం
వారికి తీపి॥"
—మట్టా అప్పలస్వామి, దేవాది.

* * *

"బుద్ధి జీవులు గడ్డి తింటే
గడ్డి తినే జీవులు బుద్ధి చెబుతాయి॥"
—టి. బాలకిషన్, బేతవోలు.

"స్వతః 'మంచివి', 'చెడ్డవి', అని లేవు:
మన ఆలోచనల వల్లే అవి 'మంచివి', 'చెడ్డవి' అవుతాయి." —షేక్స్‌పియర్

పొక్కులు) - ఇలాంటి 'అలెర్జీ' లన్నీ గాలిలో ఎగిరే కంటికి కనిపించని కొన్ని సూక్ష్మ కణాలను లోపలకు పీల్చడం వల్ల సంక్రమిస్తాయి. అలాంటి సూక్ష్మ కణాలలో కొన్ని:

1. పుప్పొడి (pollen) : అన్ని రకాల చెట్ల, పాదు మొక్కల తాలూకు పూలనుంచి గాలిలో చేరే కణాలు.



2. కుక్క గొడుగుల తాలూకు జీవ కణాలు (fungal spores) : వాతావరణం తేమగా ఉన్నప్పుడు కూరగాయలు మొ.నవాటి మీద పెరిగే బూజు లాంటి పదార్థాల కణాలు.

3. చీడ పొలుసులు (dandruff) : కుక్కలు, పిల్లులు, సీమకుందేళ్ళు, పశువులు మొ. న వాటి శరీరం మీది చీడనుంచి రాలే వెంట్రుకలూ, పొలుసులూ.

4. క్రిమి భాగాలు (fragments of insects and mites) : పాత సామాన్లు, తివాచీలు, పుస్తకాలు, ఫైళ్ళు మొ. లో కనిపించే చెదవంటి సూక్ష్మక్రిముల భాగాలు.

పై కణాలలో దేనిపట్ల అయినా ఒక వ్యక్తికి 'అలెర్జీ' ఉంటే ఆ కణాలను అతడు లోనికి పీల్చడం వల్ల ఆ వ్యాధి లక్షణాలు కనిపిస్తాయి.

వాతావరణంలో మరో రకపు సూక్ష్మ కణాలు కూడా ఉంటాయి. పరిశ్రమల లోనూ, గనులలోనూ వెలువడే ధూళికణాలు అవి. పంచదార మిల్లులలోనూ, సిమెంట్ ఫాక్టరీలలోనూ, పిండి మరలలోనూ, బట్టల మిల్లులలోనూ, వివిధ రాసాయనిక పదార్థాలు ఉత్పత్తిచేసే ఫాక్టరీలలోనూ ఈ విధమైన ధూళిచేత వాతావరణం కలుషితమై ఉంటుంది. ఆ ధూళి కణాలను తిరిగి తిరిగి పీల్చడం వల్ల అక్కడ పనిచేసే కార్మికులకు వచ్చే వ్యాధులను 'న్యూమో కోనియానిస్' అంటారు. ఈ వ్యాధులు బయట పడడానికి చాలా సంవత్సరాలు పట్టవచ్చు. క్రమంగా రోగికి శ్వాస కష్టం అవుతూ వస్తుంది.

వ్యాధి కలిగించే కణాలు లోపలికి పోకుండా నిరోధించేందుకు సహజంగానే మనిషి శరీరంలో కొన్ని ఏర్పాట్లు ఉన్నాయి. 1. ముక్కులోని వెంట్రుకలు కొంతవరకూ ఈ కణాలను నిరోధిస్తాయి. 2. మీసాలూ,

(మిగతా 53వ పేజీలో)

## శతాధిక వృద్ధులలో ప్రపంచ రికార్డు

ప్రస్తుతం రష్యాలోని అజర్ బెయిజాన్ రిపబ్లిక్ (Trans Caucasian Republic of Azerbaijan)లో 1200 మంది శతాధిక వృద్ధులు ఉన్నారు. వారిలో చాలామంది కళ్ళద్దాలు లేకుండా చదువుతారు. వారి వినికిడి శక్తి దెబ్బ తినలేదు. ఇప్పటికీ కాయకష్టం చేయ గలరు. ఇంతమంది శతాధిక వృద్ధులు ఉన్న ప్రాంతం ప్రపంచంలో మరొకటి లేదు.

---

"దైన్యం రక రకాల వ్యక్తులతో పరిచయం కలిగిస్తుంది."— షేక్స్పియర్

# భారత యోగులు

## 'తిరుక్కురళ్' గ్రంథకర్త
# తిరువళ్లువర్

డా|| మను జి. భగత్

గడచిన 2 వేల ఏళ్లుగా తమిళ జాతి జీవితం మీదా, సాహిత్యం మీదా అసాధారణమైన ప్రభావం చూపిన ఉద్గ్రంథం - 'కురళ్'. ఆ 'కురళ్'ను తమిళ జాతికి అనుగ్రహించిన యోగి, కవి, తత్త్వవేత్త, స్మృతి కర్త అయిన మహానుభావుడు తిరువళ్లువర్. మద్రాసులో ప్రతి ప్రభుత్వ బస్సులోనూ కనిపించే ఆయన చిత్రపటం, సూక్తులూ, ఆయన పేర నుంగంబాకంలో నిర్మించబడిన విశిష్ట సౌధం 'వళ్ళువర్ కోట్టమ్' నేటికీ తమిళులు ఆయనను ఎలా ఆరాధిస్తున్నదీ సూచిస్తాయి.



తిరువళ్లువర్

క్రీ.శ. మొదటి శతాబ్దంలో తిరువళ్ళువర్ జీవించి ఉండవచ్చునని ఊహిస్తున్నారు. ఇతర భారత యోగులందరి లాగానే తిరువళ్ళువర్ జీవిత చరిత్ర కూడా విస్పష్టంగా గాని, సమగ్రంగా గాని ఎవ్వరికీ తెలియదు. ప్రచారంలో ఉన్న కొన్ని గాథలనుబట్టి - ఆయన మదురైలో జన్మించారు. 'భగవాన్' అనే ఒక బ్రాహ్మణునికీ, 'ఆది' అనే ఒక తక్కువ కులం స్త్రీకీ కలిగిన అక్రమ సంతానం ఆయన!

అసలు పేరు ఎవరికీ తెలియదు. 'తిరువళ్ళువర్' అంటే వళ్ళువర్ కులంలో పుట్టిన పవిత్ర వ్యక్తి అని అర్థం ఆ నాటి వళ్ళువర్ కులస్థులు ఏనుగుల మీద ఎక్కి డప్పు వాయిస్తూ రాజశాసనాలు చాటింపు వేస్తూ ఉండేవారు. నేటికీ తక్కువ కులం వారిలో పూజారులనూ, చెప్పే వారినీ, పంతుళ్ళనూ 'వళ్ళువర్'లు అనడం ఉంది.

వళ్ళువర్ బాల్యం ఎలా గడిచిందీ, ఎక్కడ ఎవరివద్ద ఆయన విద్యాభ్యాసం

---

" 'ప్రాత'ను విలువుకో! 'క్రొత్త'ను తెలుసుకో!" —చైనా సామెత

చేసిందీ మనకు కచ్చితంగా తెలియదు. సంప్రదాయంగా వస్తున్న కథల ప్రకారం ఆయనను ఒక బ్రాహ్మణుడు పెంచి పెద్దచేశాడు ఒక చిన్న ఓడ కెప్టాన్ 'ఇలాలసింగన్' ఆయనకు ఆప్త మిత్రుడు. బాలుడుగా ఎందరో విదేశీయులను కలసి మాట్లాడే అవకాశం ఆయనకు లభించినట్టు తోస్తుంది. వివిధ జాతుల, మతాల సంస్కృతులూ,ఆచార వ్యవహారాలూ ఆయనకు తెలుసు. వర్తకులతోనూ, రైతులతోనూ కలిపి మెలపి తిరిగి, వారి నమ్మకాలనూ, ఆచారాలనూ ఆయన గ్రహించారు.

యువకుడుగా - ఈ లోకాన్ని గురించీ, లోకంలోని మనుష్యులను గురించీ తెలుసుకోవా లనే గాఢమైన తృష్ణ వళ్ళువర్‌లో కనిపించేది. 'మార్గ సగాయన్' అనే ఆయన వళ్ళువర్‌కి తన కూతురు నిచ్చి పెళ్ళి చేస్తానని వచ్చాడు. గృహస్థ ధర్మాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చే వళ్ళువర్ ఆ వధువు శక్తి, సామర్థ్యాలను పరీక్షించా లనుకున్నాడు. ఒక తట్టెడు ఇసుక ఇచ్చి "దీనిని అన్నంగా వండి తెస్తే మీ అమ్మాయిని నేను వివాహమాడుతాను" అని ఆయనతో అన్నాడు ఆ అమ్మాయి పేరు వాసుకి. ఆ అందమైన వరుడు చెప్పిన పని సాధ్యమే అని నమ్మి మారు మాట లేకుండా ఆమె ఆ ఇసుకను పొయిమీద పెట్టి వండసాగింది. సౌశీల్యవతికి సమస్త దేవతలూ సహాయం చేస్తారు. చిత్రంగా ఆ ఇసుక ఉడికి అన్నం అయింది. వాసుకి అమాయికత్వం, విధేయతా వళ్ళువర్‌కి నచ్చాయి అతడు ఆమెను వివాహమాడాడు.

అనంతరం ఆ భార్యాభర్తలు మైలాపూర్ (ప్రస్తుతం మద్రాసులో ఒక పేట)లో స్థిర పడ్డారు. ఒక ప్రాచీన దేవాలయం, దాని చుట్టూ కొబ్బరి చెట్లూ, స్వామిల ఇళ్ళూ ఉన్న అందమైన, ప్రశాంతమైన ఒక గ్రామం అది. అక్కడ కొబ్బరి ఆకులు నేసిన ఒక పట్టి ఇంట్లో ప్రశాంత పరిసరాలలో వళ్ళువర్ దంపతులు జీవించేవారు. జీవనోపాధికి చేనేత వృత్తిని ఆయన అవలంబించాడు. వృత్తులన్నిటిలో ఆయన దృష్టిలో 'చేనేత' మిక్కిలి అమాయికమైన వృత్తి!

వళ్ళువర్ బట్టలు నేస్తూ ఉంటే కండె

## రోజు రోజూ పెరుగుతున్న ప్రపంచ జనాభా



ఇటీవల ఐక్యరాజ్య సమితివారు జరిపిన జనాభా పరిశీలన ప్రకారం 2,0{9 నాటికి ప్రపంచ జనాభా 700 కోట్లు కాగలదు. గత అయిదేళ్ళలోనూ రోజు వారీ జనాభా అభివృద్ధి 1,80,000. రోజూ 3,20,000 మంది పుడుతూంటే 1,40,000 మంది చని పోతున్నారు.

"అంతఃకరణ స్వచ్ఛంగా ఉంచుకో; ఎడారి మధ్య నిర్భయంగా నిద్రపో!" —అరబ్బీ సామెత

ఇటూ అటూ తిరుగుతూ అయే లయాత్మకమైన ధ్వనితో పాటు ఆయన నోటి వెంట వెలువడే 'కురళ్' గీతాలు కూడా అదే లయతో ఆ త్రోవను పోయేవారికి వినిపిస్తూ ఉండేవి. అక్కడికి సముద్ర తీరం చాలా దగ్గర. నిత్యం సముద్ర ఘోష వింటూ తుఫాన్‌లతో, ఒడుదుడుకులతో సాగే ఈ మానవ జీవితం కూడా ఆ సముద్రం లాంటిదే అని ఆయన అనుకునేవాడు.

తన అవసరాలకు మించి ఎక్కువ ఏమీ కోరకుండా నిరాడంబరంగా, ప్రశాంతంగా వళ్ళువర్ జీవితం గడిపాడు. తన భర్త కోరుకున్న గృహిణీ ధర్మాలన్నీ వాసుకిలో మూర్తీభవించాయి. సరళమైన ఆమె అందచందాలు వళ్ళువర్‌ని ఆనందపరవశుణ్ణి చేసేవి. సుఖ, శాంతులతో, నిత్య సంతుష్టితో ఆ దంపతులు జీవితం గడుపసాగారు. ఏ వేళప్పుడు ఏ అతిథి వచ్చి తలుపు తట్టినా అమిత ఆదరంగా ఆతిథ్యమిచ్చి ఆదరించేవారు.

తరచు తాను నేసిన వస్త్రాలు తీసుకుని వళ్ళువర్ సంతకు వెళ్ళేవాడు. న్యాయమైన ధర చెప్పేవాడు. బేరం చేయవలసిన అవసరం అవతలివారికి కల్పించేవాడు కాదు. 'ఓర్పు', 'శాంతం' మూర్తీభవించినట్టు కనిపించే వళ్ళువర్‌కి ఎలాంటి బేరగాడూ కూడా కోపం తెప్పించలేక పోయేవాడు కోపంగాని, దురాశగాని పీసం కూడా లేని వ్యక్తిగా, మానవులపట్ల కారుణ్యంతో నిండిన హృదయం గల యోగిగా క్రమంగా ఆయనను అందరూ గుర్తించసాగారు. ఆయన మహాజ్ఞాని అనే పేరు వాడ వాడలా వ్యాపించింది.

ఒకరోజున వళ్ళువర్ ఇంటికి ఒక ఆగంతుకుడు వచ్చాడు. "స్వామీ! గృహస్థాశ్రమం మంచిదా? సన్న్యాసాశ్రమం మంచిదా?" అని వళ్ళువర్‌ను ఆయన ప్రశ్నించాడు. తనతో పాటు కొన్నాళ్ళు అక్కడ ఉండి, ఆ ప్రశ్నకు సమాధానం స్వయంగా తెలుసుకోమని వళ్ళువర్ ఆ అతిథిని కోరాడు.

మరునటి రోజు ఉదయం వాసుకి ఆ ఇరువురికీ తరవాణి నీళ్ళలో నుంచి తీసిన చద్ది

## సింహం ధర్మానికి చిహ్నం!



ప్రాచీన కాలంలో ఇండియాలో రాజులు 'సింహాసనం' (సింహాలు చెక్కి ఉన్న బంగారు పీఠం) మీద కూర్చుని ధర్మ నిర్ణయం చేసేవారు. అశోకుని ధర్మ చక్రంతో కూడిన స్తంభం అగ్ర భాగాన 4 సింహాలు చెక్కబడి ఉండడంలో ఉన్న రహస్యం ఇదే: ధర్మానికి చిహ్నం సింహం. సారనాథ్‌లోని అశోక స్తంభం మీది ఆ భాగాన్నే భారత ప్రభుత్వం తన అధికార లాంఛనగా గ్రహించింది.

"అరువు సొమ్ము బరువు చేటు!" — తెలుగు సామెత

అన్నం పెట్టి, నీళ్ళు తేవడానికి బావికి వెళ్ళింది. ఉన్నట్టుండి వళ్ళువర్ అన్నం వేడికి తన చేతులు కాలుతున్నా యని గట్టిగా అరిచాడు. ఆ మాట విని వాసుకి బావిలో వేసిన కుండను మధ్యలో అలాగే వదలి, పరుగు పరుగున వచ్చి భర్తముందు కూర్చుని విసనకర్రతో విసరడం మొదలుపెట్టింది.

మరో రోజున మిట్ట మధ్యాహ్నం సూర్యుడు తీవ్రంగా ప్రకాశిస్తూ ఉన్న సమయంలో వళ్ళువర్ మగ్గం ముందు కూచుని నేస్తూ కండె క్రిందకు జారవిడిచి, "నా కండె పడిపోయింది — వెతకాలి — దీపం తీసుకురా!" అని అరిచాడు. మారు మాట్లాడకుండా వెంటనే వాసుకి దీపం వెలిగించి తెచ్చింది.

ఆదర్శ ప్రాయమైన ఆ గృహస్థ జీవనం చూసి ఆ ఆగంతుకుడు స్వయంగానే తన ప్రశ్నకు జవాబు తెలుసుకున్నాడు. వాసుకి లాంటి ఉత్తమ గృహిణి లభించనప్పుడు తప్ప సన్న్యసించవలసిన అవసరంలేదని ఆయనకు బోధపడింది.

వాసుకి చనిపోయేవరకూ ఆ దంపతులు సుఖంగా జీవితం గడిపారు. అవసాన సమయంలో వాసుకి సాభిప్రాయంగా భర్త వంక చూసింది. "ఏమిటి నీ సంశయం - చెప్పు!" అని అడిగాడు వళ్ళువర్. "మన వివాహం అయిన కొత్తలో నేను మీకు భోజనం వడ్డిస్తే ఎప్పుడు అన్నం వడ్డించినా ప్రక్కన ఒక కప్పుతో నీళ్ళూ, ఒక సూదీ పెట్టమని ఆదేశించారు - అది ఎందుకు చెప్పండి!" అంది వాసుకి.

"అన్నం మెతుకులు క్రిందపడితే సూదితో వానిని గుచ్చి తీసి కప్పులోని నీళ్ళలో కడిగి తిరిగి భుజించడానికి!" అని వళ్ళువర్ అన్నాడు. అంటే - అన్నం ఒక్క మెతుకు కూడా పారవేయకూడదని ఆయన మతం. ఆ జవాబు విని సంతృప్తిగా తుదిసారి కన్ను మూసింది వాసుకి. అమాయికురాలూ, అనుకూలవతీ అయిన వాసుకి ఆ ఒక్కసారి తప్ప భర్త ఆదేశాలను ఎన్నడూ ప్రశ్నించి ఎరుగదు.

భార్యా వియోగ దుఃఖం భరించలేక వళ్ళువర్ సన్న్యసించాడు. మానవ జీవితం

---

## 2,000 పౌన్ల బరువుండే గద్ద గూడు



జీవితం అంతా గద్ద ఒకే 'పెంటి'తో కాపురం చేస్తుంది. ఎత్తైన చెట్లమీద ఒకే గూడు కట్టుకుంటుంది. ఏటేటా ఆ గూటికి మరమ్మత్తులు చేస్తూ దాన్ని పెంచుతూ వస్తుంది. కొద్ది సంవత్సరాలలోనే దాని బరువు 2,000 పౌన్లదాకా పెరుగుతుంది.

"యౌవనంలో కూడబెట్టు: వార్ధక్యంలో వాడుకో!"

వివిధ ముఖాలను సూక్ష్మంగా దర్శించి తాను గ్రహించిన సత్యాలను 'కురళ్'లుగా గానం చేయసాగాడు. సాంఘిక, నైతిక విషయాలలో తమిళులకు వేదం అని చెప్పదగిన ఆ 'కురళ్'కు పండిత జనుల ఆమోదం అంత తేలికగా లభించ లేదు మదురై లోని 'సంగం' (పండిత పరిషత్) వారికి తన 'కురళ్' వ్రాతప్రతిని ఆయన పంపాడు. పాండిత్యంలేని ఒక హీన కులజుడు వ్రాశాడని ఆ గ్రంథాన్ని వారు తిరస్కార భావంతో చూశారు. చివరకి దాని విలువను నిర్ణయించడానికి ఒక ఉపాయం ఆలోచించారు. అక్కడ ఉన్న కలువకొలనులో తేలుతున్న ఒక కొయ్య చెక్కమీద 'సంగం' పండితులంతా ఆ ప్రతిని మధ్య పెట్టుకొని కూచున్నారు. చిత్రంగా అందరూ చూస్తూ ఉండగా ఆ చెక్క క్రమంగా కుంచించుకుపోయి ఆ వ్రాతప్రతికి మాత్రమే సరిపోయేటంత చిన్నది అయింది. పండితులంతా కొలనులో పడి మునిగిపోయారు.

వళ్ళువర్ మహాకవి తన అవసాన సమయం సమీపించిందని గుర్తించారు. తన ప్రియ శిష్యులను పిలిచి వారితో ఆయన ఇలా అన్నారు: "నాయనా! నేనింక ఎక్కువ కాలం జీవించను. ఈ శరీరంలోనుంచి హంస ఎగిరిపోగానే ఈ దేహాన్ని తీసుకుపోయి ఒక అడవిలో వదలండి. అక్కడి పక్షులూ, అడవి మృగాలూ దానిని మట్టిలో కలుపనీయండి.

ఆ తరువాత కొద్ది రోజులకే ఆయన దేహత్యాగంచేసి అమరజీవి అయారు!

## మద్రాసు 'జూ' ప్రాచీనత

'జూ'లు స్థాపించే ఉద్యమం ఇండియాలో 1855 లోనే ప్రారంభమైంది. మొట్టమొదటి 'జూ' మద్రాసులో ఆ ఏడాది స్థాపించారు. ఆ తరువాత 1857 లో తిరువనంతపురంలోనూ, 1863 లో బొంబాయిలోనూ, 1875 లో కలకత్తాలోనూ, 1921 లో లక్నోలోనూ 'జూ' లు వెలిశాయి. ప్రస్తుతం ఇండియాలో 27 'జూ'లు వివిధ రాష్ట్ర ప్రభుత్వాల అజమాయిషీ క్రిందా, 10 వివిధ పురపాలక సంఘాల యాజమాన్యంలోనూ ఉన్నాయి.

## 1945 నుంచీ జరిగిన పరమాణు పరీక్షలు



స్వీడెన్ లోని స్టాక్‌హోమ్‌లో ఉన్న అంతర్జాతీయ శాంతి సంస్థ నివేదిక ప్రకారం 1945 నుంచి ఇప్పటికి 1,000 పైచిలుకు పరమాణు పరీక్షలు జరిగాయి. వీటిలో 90 శాతం రెండు అగ్రరాజ్యాలైన రష్యా అమెరికాలు జరిపినవే! అమెరికా 638 పరీక్షలు జరిపితే రష్యా 398 పరీక్షలు జరిపింది.

"కాకిపిల్ల కాకికి ముద్దు!" — తెలుగు సామెత

# నవ్వు మహిమ

కె. లక్ష్మణరావు

"ఎప్పుడూ నవ్వుతూ, సంతోషంగా ఉంటే
ఏ ప్రార్థనలకంటె కూడా తేలికగా అది నిన్ను
దేవునికి చేరువ చేస్తుంది."
—వివేకానంద



ఒక చిత్రం మీరు గమనించారో లేదో! ఈ సృష్టిలో ఉన్న అనంతకోటి జీవరాశి లోనూ మానవుడు ఒక్కడే నవ్వ నేర్చిన వాడు! 'నవ్వు' మనిషికి అపురూపమైన వరం! మన 'ఉత్సాహపు' బాటరీలను 'నవ్వు' తిరిగి తిరిగి భర్తీచేస్తూ ఉంటుంది.

సంతోషం కలిగినప్పుడు, ఉత్సాహభరితులం అయినప్పుడు, లేదా మన సంతోషాన్ని ఇతరులకు ప్రకటించా లనుకున్నప్పుడు మనం నవ్వుతాము. మన చుట్టూ ఉన్నవారికి మనం ఇవ్వగల మిక్కిలి హర్షదాయక మైన కానుక — 'నవ్వు!' ఏ ఇతర జంతువూ తన తృప్తినీ, ఆనందాన్నీ, ఉత్సాహాన్నీ 'నవ్వు' ద్వారా ప్రకటించ లేదు. నిజానికి మానవుని విశిష్ట లక్షణాలలో ముఖ్యంగా పేర్కొనవలసింది — 'నవ్వు!'

"నవ్వడం చేతకాకపోతే నువ్వు సేల్స్ మన్‌గా పనికిరావు" అని సాధారణంగా అంటూ ఉంటారు. కాని, నిజానికి అన్ని వృత్తులకూ, జీవితంలోని అన్ని రంగాలకూ ఈ మాట వర్తిస్తుంది. ఇతరులతో మనం పనులు చేయించుకోవలసి ఉన్నప్పుడు 'నవ్వు' ఎక్కువ లాభసాటిగా కన్పిస్తుంది. మన

## నిజమైన 'విజయం' ఏది?

జీవితంలో విజయం సాధించడం అంటే బోలెడు డబ్బు గడించడం, మేడలూ, మిద్దెలూ కట్టడం కాదు. జీవితంలో మనకు తగిన దని భావించి మనకు మనంగా ఎంచుకున్న లక్ష్యం వైపు రోజూ కొంత కొంత పురోగమిస్తూ ఉండడమే నిజమైన 'విజయం'. 'లక్ష్యం' అనేది—అది ఏదైనా కానీయండి—మన జీవితానికి ఒక అర్థాన్ని కల్పిస్తుంది. అది అందకుండా ఉన్న కొమ్మ మీది ద్రాక్ష గుత్తి లాంటిది. నిత్యం కృషి చెయ్యడానికీ, మనల్ని ఉత్సాహ భరితుల్ని చేయడానికీ అది
—ఎర్ల్ నైటింగేల్

"ప్రగల్భాలు పలికేవారు పిసరంత కూడా సాధించ లేరు!"

ప్రమోదాన్నీ, ఆమోదాన్నీ ప్రకటించడం మాత్రమే కాదు: 'నవ్వు' ఇతరులను మన ఆనందంలో పాలు పంచుకునేందుకు ఆహ్వానిస్తుంది. సంతోషాన్ని అంటువ్యాధిలాగ అందరికీ వ్యాపింప జేయడానికి 'నవ్వు'ను మించిన తేలికయిన, శ్రేష్ఠ ఫలితాలు చూపే సాధనం ఇంకోటి లేదు. 'నవ్వడం'వల్ల మనకు పోయేది ఏమీ లేకపోగా, మనకూ, ఇతరులకూ కూడా అది ఎంతో మేలు చేస్తుంది.



మన చుట్టూ తగినంత వేదన, విషాదం ఉన్నాయి. ఆ వేదనలను మరింత పెంచడం కాదు మనం చేయవలసిన పని: మన నవ్వు మన నరాలనే కాకుండా ఇతరుల నరాలను కూడా స్తిమిత పడేట్టు చేస్తుంది.

మన భావ ప్రకటన కచ్చితంగానూ, పటిష్ఠంగానూ జరిగేందుకు 'నవ్వు' తోడ్పడుతుంది. ఆదరానికీ, ఆప్యాయతకూ చిహ్నం 'నవ్వు.' నవ్వుతూ ఎదుటివాణ్ణి మనం పలుకరిస్తే అతని నరాల బిగువు తగ్గి ధనాత్మకం (positive) గా అతడు ఆలోచించడం మొదలు పెడతాడు.

నువ్వు నవ్వితే లోకం అంతా నీతో కలిసి నవ్వుతుంది. 'దుఃఖం' లో ఎవ్వరూ నీకు తోడు రారు. ఒంటరిగానే నీ దుఃఖాన్ని నువ్వు అనుభవించవలసి ఉంటుంది.

'నవ్వు' మనలో ఆనందాన్ని వెల్లి విరియ జేసినట్టే ఇతరులలోనూ ఆనందాన్ని మేల్కొలుపుతుంది. మన 'ఋణాత్మక' negative) మైన ఆలోచనలకూ, వైఖరులకూ 'నవ్వు' స్వస్తి చెబుతుంది. మన మనస్సులను విప్పారేట్టు చేసి నూతన భావాలకు స్వాగతం పలుకగల శక్తిని మనకు ఇస్తుంది.

నవ్వుతూ కోప్పడాలని ప్రయత్నించి

---

## 20వ శతాబ్ది వంచకాగ్రేసరుడు!

ఈ 20 వ శతాబ్దంలో ఫెర్డినాండ్ వాల్డో డెమోరాను మించిన వంచకుడు ఉండడు. తను వెనుక చేసిన ఉద్యోగాల ఊహా చరిత్ర అతడు తయారు చేశాడు. ఇతరులు తనను గురించి వ్రాసినట్టు ఫోర్జరీ సంతకాలతో ప్రశంసా పత్రాలు సృష్టించాడు. ఎన్నో కళాశాలలలో పిహెచ్ డీ. గా చలామణీ అయి, వినియుక్త మనశ్శాస్త్రం (applied psychology) లో ప్రొఫెసర్‌గా పనిచేశాడు. కొరియా యుద్ధ కాలంలో ఒక రాయల్ కెనడియన్ ఓడ మీద సర్జన్ లెఫ్టినెంట్‌గా పని చేస్తూ అంతకు ముందు ఎలాంటి వైద్య శిక్షణా లేకపోయినా, 19 మంది సైనికులకు ఆపరేషన్‌లు చేసేశాడు. అతని బూటకం బయట పడేవేళకు ఎవ్వరికీ కనిపించకుండా అంతర్ధానం అయాడు:

"అన్నిటినీ నమ్మేవాడు నష్టపోతాడు;
ఏదీ నమ్మనివాడూ నష్టపోతాడు!"

చూడండి. ఎన్నటికీ మనం ఆ విషయంలో కృతకృత్యులం కాలేము. ఒక్క క్షణంలో 'నవ్వు' మన విచారాలనూ, బాధలనూ దూరం చేస్తుంది. 'నవ్వు'కి గొప్ప ఉత్పాదక శక్తి కూడా ఉంది ఒక్కొక్కప్పుడు మనకు పూర్తిగా సంతోషం కలగనప్పుడు కూడా



నవ్వుతూఉండడంవల్ల చాలా లాభా లున్నాయి. నవ్వువల్ల కలిగే లాభం ప్రత్యక్షంగానే మనకు తెలుస్తుంది. అది మన సంతోషాన్ని పెంచి, మనస్సును ప్రశాంతపరచి, నాడీమండలంలో ఏర్పడిన బిగువులను సడలిస్తుంది.

'నవ్వు' మన కార్య దక్షతను పెంచు తుంది. మన జట్టు వారికి మనల్ని ఆదర్శ ప్రాయులను చేస్తుంది. మన నాయకత్వాన్ని అందరూ ఆమోదించేట్టు చేస్తుంది. నవ్వుతూ ఉండే మనిషి తాలూకు మెదడు మరింత 'ధనాత్మకం' (positive) గా పనిచేస్తుంది. ఎన్ని చెప్పినా, శాంతి, అశాంతి మనస్సుకు సంబంధించిన రెండు స్థితులు. మీరు పని చేసే కార్యాలయంలో ఎప్పుడూ నవ్వుతూ ఉంటే ఎప్పుడూ 'ధనాత్మక' (positive) మైన ఫలితాలే అది ఇస్తుంది.

మీరు తీవ్రంగా ఆలోచిస్తున్నప్పుడూ, అవ ధానంతో ఏదో వింటున్నప్పుడూ, మనస్సును దేనిమీదనో లగ్నంచేసి ఉన్నప్పుడూ కూడా పెదవులమీద చిరునవ్వును చిందిస్తూనే ఉండ వచ్చును. సహజంగా వెలువడే నవ్వు వ్యక్తులమధ్య సంబంధాలను మరింత పటిష్ఠం చేస్తుంది. నవ్వుతూ పని చేస్తే మనం చేసే పని మనకు మరింత ఉత్సాహాన్నీ, సం తృప్తినీ కలిగిస్తుంది.

## గాంధీ టోపీ

ఇప్పటికీ చాలామంది తలల మీద
తరచు కనిపిస్తూంది గాంధీ టోపీ!
దానిని ధరించేవారిలో ఒక్కడు నిజాయితీ
పరు డుంటే లక్షమంది అవినీతి పరులు!
అపవిత్రం చేస్తున్నారు ఆ టోపీని—
'అధికారానికి సాధనం అయింది
గాంధీ టోపీ ఈ నాడు
ఆ టోపీ శక్తి ఏ మంత్రదండానికీ లేదు
త్యాగానికీ, పవిత్రతకూ ఒకప్పుడు
చిహ్నం అది!
ఎవరి పేరువల్ల దానికీ మహత్తు వచ్చిందో
ఆ మహాత్ముని ఆత్మ స్వర్గంలో నేడు
ఎంతగా క్షోభ పడుతూందో గదా—
ఆ టోపీ ధరించి చేస్తున్న
అక్రమాలు చూస్తూ!

—కె. టి. నరసింహాచార్

"వడివడిగా పైకి ఎగబ్రాకా అని చూసేవారు
ఒక్కసారిగా క్రింద పడతారు!"

## భారతీయ మనీషులు

# అలాన్ ఆక్టేవియన్ హ్యూమ్

డా॥ డి. ఆంజనేయులు

ఇండియాకు బ్రిటిష్ పాలన నుంచి విముక్తి సాధించడమే కాక, 1947 లో స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఇప్పటి వరకూ



ఇంచుమించు అవ్యాహతంగా ఇండియాలో ప్రభుత్వం నెరపుతూ వచ్చిన ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ వచ్చే ఏడాది (1985) తన శత జయంతి ఉత్సవాలు జరుపుకోబోతూంది. చిత్రం ఏమిటంటే—అది 'ఇండియన్ నేషనల్ కాంగ్రెస్' అయినా, దానిని స్థాపించిన మహనీయుడు ఇండియన్ కాదు; ఒక ఆంగ్లేయుడు. ఆయన పేరు అలాన్ ఆక్టేవియన్ హ్యూమ్. ఇండియా చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగిన పేరు ఆయనది. కాంగ్రెస్‌ను స్థాపించడమే కాక ఇంచుమించు రెండు దశాబ్దాలపాటు ఆయనే దానికి ప్రధాన కార్యదర్శి.

అలాన్ ఆక్టేవియన్ హ్యూమ్ 1829 లో స్కాట్లండ్ దేశంలో కష్టపడి సముద్రం మీద పని చేసే ఒక సాధారణ కుటుంబంలో

## పొడుపు ప్రశ్నలు

ఏది—

1. తల ఉన్నా కళ్ళు లేనిది?
2. కన్ను ఉన్నా తల లేనిది?
3. కాళ్ళున్నా పాదాలు లేనిది?
4. అడుగులు ఉన్నా కాళ్ళు లేనిది?
5. పత్రాలు ఉన్నా ఆకులు లేనిది?
6. శాఖలు ఉన్నా ఆకులు లేనిది?
7. ముఖం ఉన్నా మెడ లేనిది?
   పళ్ళు ఉన్నా నోరు లేనిది?

(జవాబులు 35 వ పుటలో)

"తన మనుగడకు అవసరమైనంత భూమి మీద ప్రకృతి సిద్ధంగా ప్రతి మనిషికీ హక్కుంది." —సర్ థామస్ మోర్

జన్మించాడు. ఆయన తండ్రి జోసెఫ్ హ్యూమ్ 'ఈస్ట్ ఇండియా కంపెనీ'లో పని చేసి. ఆ తరువాత ఒక తీవ్రవాది (radical)గా పార్లమెంట్‌కు ఎన్నికయాడు. ఆదిలో అలాన్ హ్యూమ్ నౌకాదళ శిక్షణ పొంది, హెయిలీబరీలో విద్యాభ్యాసం చేసి, తన 20వ ఏట 'బెంగాల్ సివిల్ సర్వీస్'లో చేరాడు.

దాదాపు రెండు దశాబ్దాల పాటు (1849 మొదలు 1867 దాకా) జిల్లా ఆఫీసర్‌గా పని చేస్తూ హ్యూమ్ క్షామ నివారణ కార్యక్రమాలలో విశేషానుభవం గడించాడు. ఆ తరువాత 3 ఏళ్ళు ఒక కేంద్రపాలిత శాఖకు అధిపతిగా ఉన్నాడు. అనంతరం సిమ్లాలో 'గవర్నమెంట్ ఆఫ్ ఇండియా' సెక్రటరీగా పని చేశాడు. కాని, ఆ పైన 3 ఏళ్ళలోగానే పై అధికారులతో తనకు ఏర్పడిన అభిప్రాయ భేదాలు కారణంగా పదవీ కాలం ముగియకుండానే ఆయన పదవి నుంచి విరమించుకున్నాడు.

ఆయన సమర్థతా, ప్రభుభక్తీ పై అధికారుల ప్రశంసలకు పాత్రం అయినా,ఆయన నిర్భయత్వం. భారతీయులపట్ల ఆయనకు గల సానుభూతీ హోమ్ గవర్నమెంటు వారికి కంటకం అయాయి. విందులు. వినోదాలు అంటే ఉండే అనిష్టత వల్ల లెఫ్టినెంట్ గవర్నర్‌గా పని చేసేందుకు ఆయన నిరాకరించాడు. ఆయనను 'హోమ్ మెంబర్'ని చెయ్యాలని వైస్రాయ్ చేసిన సిఫార్సును కొన్ని రాజకీయ కారణాల వల్ల ఆ నాటి కన్సర్వేటివ్ ప్రధాని మార్క్విస్ ఆఫ్ శాలిస్‌బరీ త్రోసిపుచ్చాడు.

సివిల్ ఉద్యోగిగా పని చేసిన రోజుల నుంచీ హ్యూమ్‌కు విశేషాసక్తి కలిగించిన అంశాలు రెండు: పక్షులూ, రైతులూ! పక్షి శాస్త్రవేత్తగా ఆయన కృషి అపూర్వమైంది. స్ట్రే ఫెదర్స్ (stray feathers) అనే ఒక పత్రికను ఆయన చాలా ఏళ్ళు నడిపారు. 'నెస్ట్స్ అండ్ ఎగ్స్ ఆఫ్ ఇండియన్ బర్డ్స్' (ఇండియా పక్షుల గూళ్ళు, గుడ్లు-1873), 'ది గేమ్ బర్డ్స్ ఆఫ్ ఇండియా' (ఇండియాలో

## డేగ వేట



డేగలతోనూ, గద్దలతోనూ వివిధ జంతువులనూ, పక్షులనూ వేటాడే వినోదం ప్రాచీన కాలంలో ఉండేది. మానవులు అక్షరాస్యులు కాక ముందు నుంచీ ఈ క్రీడ వారికి తెలుసు. యూరోపియన్ వర్తకులు పశ్చిమాసియా వాసుల నుంచి ఈ క్రీడను నేర్చుకుని డేగ వేటకాండ్రను కొందరిని తమ వెంట తీసుకువెళ్ళారు 17వ శతాబ్దంలో 'షాట్ గన్' వెలసిన తరువాత యూరప్‌లో ఈ క్రీడ చాలా వరకు అంతరించింది.

—('హల్లో ఫ్రెండ్స్' సౌజన్యంతో)

"ఆశ్చర్యంలో నుంచే తత్త్వశాస్త్రం పుడుతుంది!" —సోక్రటీస్

వేటాడదగిన పక్షులు—మూడు సంపుటాలు—1879) వంటి ప్రామాణిక గ్రంథాలు కూడా ఆయన వ్రాశారు. అయన సేకరించిన పక్షుల రకాలూ, జంతు శిరస్సులూ, కొమ్ములూ సిమ్లాలోని ఆయన నివాసంలో అతిథులను ఆశ్చర్య చకితులను చేసేవి. అనంతర కాలంలో లండన్‌లోని బ్రిటిష్ మ్యూజి యమ్‌కి ఆయన వాటిని దానం చేశారు.

ఇండియన్ ప్రజలంటే, ముఖ్యంగా ఇండియన్ రైతులంటే ఆయనకు తగని అభిమానం. దారిద్ర్యంతో క్రుంగిపోతున్న ఇండియన్ రైతుల మీద పన్నుల భారం తగ్గించడానికి ఆయన శాయశక్తులా ప్రయత్నించారు. చదువుకున్న భారతీయులకు భారతదేశ పరిపాలనలో పాల్గొనే అవకాశాలు కలిగించాలని ఆయన వాదించారు.

గవర్నమెంట్ పదవి నుంచి విరమించిన తరువాత ఎలాంటి సంకోచాలూ లేకుండా మరింత నిర్భయంగా భారత ప్రజలకు ఆయన సేవ చేశారు. తమ దేశం పరిస్థితిని మెరుగుపరుచుకునేందుకు చదువుకొన్న భారతీయులే నడుం కట్టాలని ఆయన భావన. తన వంటి విదేశీయులు బయటి నుంచి మాత్రమే స్వల్పంగా సాయం చేయగలరు. కలకత్తా విశ్వవిదాలయ పట్టభద్రులకు చేసిన విజ్ఞప్తిలో అయన ఇలా అన్నారు: "ఇండియాలో బౌద్ధిక, నైతిక, సాంఘిక, రాజకీయాభివృద్ధి సాధించడానికి మీరు ముఖ్యంగా కంకణం కట్టుకోవాలి!" ఆ విజ్ఞప్తి ఫలితంగానే 1883లో మొదట 'ఇండియన్ నేషనల్ యూనియన్' వెలసింది. అదే ఆ తరువాత 1885లో 'ఇండియన్ నేషనల్ కాంగ్రెస్' అయింది.

విలియమ్ వడ్డెర్‌బర్న్, దాదాభాయ్ నౌరోజీ సాయంతో హ్యూమ్ 1885లో మొట్టమొద[...] జాతీయ మహాసభ సమావేశపరిచారు.

1887లో మద్రాసులో జరిగిన కాంగ్రె[...] మహాసభలో ఇండియాలో అసంఖ్యాకులై[...] అభాగ్యుల జీవితాలపట్ల కొంచెం సానుభూ[...] చూపించవలసిందిగా తన దేశీయులకు (ఆంగ్[...]

## సరళమైన పరికరం



గొడుగు ఊచలను తిరగేసి దాని మీ[...] నిర్మించిన ఆంటెనాను ఒక చేతిలోను[...] చౌకగా తయారై చేతితో ఎక్కడికైనా కొ[...] పోవడానికి వీలైన 'వాకీ-టాకీ'ని మరో చే[...] లోనూ పట్టుకుని దూరంగా ఉన్న ఏ నగర[...] నుంచి అయినా తమ ఆఫీసు వారి[...] మాట్లాడడం నేడు సాధ్యం అవుతూంది. అమెరికా మీద 35.000 కి.మీ. ల ఎత్త[...] భూమితో సమాన వేగంతో పరిభ్రమిం[...] ఏ.టీ.ఎస్—3 కృత్రిమ ఉపగ్రహం ద్వా[...] ఆ సంభాషణ ప్రసారం అవుతుంది.

"అజ్ఞానానికి ఐశ్వర్యం తోడైతే ఇక అడగక్కర లేదు!" —షోపెన్‌హోవర్

ములకు) హ్యూమ్ విజ్ఞప్తి చేశాడు. ఆవేశ పూరితంగా ఆయన ఇలా ప్రకటించారు. 'శ్రమ, ఎముకలు పిండి చేసే శ్రమ, ఆకలి, జబ్బులు, యమ యాతనలు — ఇవే వారి విషాదపూరితమైన అర్ధాయుష్కపు జీవితాలలో కనిపించే ప్రధానాంశాలు!" 1892లో విడుదల చేసిన ఒక సర్క్యులర్‌లో ఇండియాలో సామూహిక రైతు విప్లవం రాబోతూం దనీ, దానిని ఎవ్వరూ అణచలేరనీ పాలక వర్గాన్ని ఆయన హెచ్చరించారు. ఆ రోజులలో ఆ సర్క్యులర్ దేశంలో తీవ్రమైన సంచల నాన్ని కలిగించింది.

ఆరంభ దశలో కాంగ్రెస్ ఉద్యమాన్ని ప్రధానంగా పోషించిన నాయకుడు హ్యూమ్! 1885 నుంచి 1906 దాకా సుమారు రెండు దశాబ్దాలు ఆయన కాంగ్రెస్ సంస్థకు ప్రధాన కార్యదర్శిగా ఉంటూ, దానికి విస్పష్టమైన లక్ష్యాలను నిర్దేశించడం, ఆర్థిక వనరులు సమ కూర్చడం, వార్షిక జాతీయ మహా సభలు జరుపడం - అన్నీ ఆయనే చేశారు. ఏ కారణంవల్లనోగాని ఏ సంవత్సరం కాంగ్రెస్ సభకూ ఆయన అధ్యక్షత వహించలేదు. హూళిక అధ్యక్ష కిరీటం ధరించక పోవడానికి ఆయన కీర్తి వైముఖ్యం, వినమ్రమైన సేవా దీక్ష కారణాలు కావచ్చు!

కలకత్తా పట్టభద్రులను ఉద్దేశించి ఆయన చేసిన సుప్రసిద్ధ విజ్ఞప్తిలో హ్యూమ్ త్యాగ స్వభావం వెల్లడి అవుతూంది. వారిని ఆయన ఇలా ఉద్బోధించారు:

"....ఆత్మ త్యాగం, నిస్స్వార్థ బుద్ధి - ఈ రెండే స్వాతంత్ర్యాన్నీ, సౌభాగ్యాన్నీ సాధించేందుకు తిరుగులేని సాధనా లన్న నిత్యసత్యాన్ని గుర్తించి, ఆ పద్ధతిలో మీరు కార్యాచరణకు పూనుకునే లోగా మీ మెడల మీది కాడి మిమ్మల్ని మరీ క్రుంగదీయకుండా చూసుకోండి!"

65 ఏళ్ళపాటు ప్రజాసేవలో ధన్యమైన జీవితం గడిపి అవసాన కాలానికి ఇంగ్లండ్ తిరిగివెళ్ళి, 1912 జూలై 31న హ్యూమ్ తుది శ్వాస వదిలారు. ఇంగ్లండ్‌లో ప్రభవించిన ఒక ఉదాత్త వ్యక్తిగా, భారతీయులకు అత్యుత్తమ సేవ చేసిన మహనీయునిగా హ్యూమ్ పేరు ఆయన అభిమానుల హృద యాలలో శాశ్వతంగా నిలిచి ఉంటుంది!

## ప్రపంచంలో మిక్కిలి వేగం గల జంతువు చిరుతపులి!



'అడవి పిల్లి' అనబడే చిరుతపులే ప్రపం చంలో మిక్కిలి వేగంగా పయనించగల జంతువు. పెద్దపులి, సింహాల కాళ్ళ కంటె దీని కాళ్ళు పొడుగ్గానూ, సన్నగానూ ఉంటాయి. ఏ దుప్పినో వేటాడవలసి వస్తే గంటకు 75 మైళ్ళ వేగంతో కూడా ఇది పరు గెత్తుతుంది. చిరుతపులి వెంటబడితే ఏ జంతువూ దాని బారి నుంచి తప్పించుకోలేదు.

"ఆరోగ్యాన్ని కాపాడుకోడం అవశ్య కర్తవ్యం." — హెర్బర్ట్ స్పెన్సర్

బహుమతి పొందిన వ్యాసం

# తిరునాళ్ల - నాడు, నేడు

వారణాశి పాపయ్యశాస్త్రి,
శ్రీకాకుళం.

తమిళులలో శైవులూ, వైష్ణవులూ కూడా పవిత్రతకు చిహ్నంగా ఒక పదానికి ముందు 'తిరు' చేరుస్తారు. 'తిరుమాళిగ' (పవిత్ర గృహం), 'తిరువారాధన' (దేవతార్చన) మొ.నవి అలాంటివే. తెలుగువారు 'తిరు'కు బదులు 'శ్రీ' చేరుస్తారు. శ్రీశైలం, శ్రీరంగం, శ్రీనగరం లాంటి పదాలు అలాంటివి.

తిరునాళ అంటే పుణ్య దినం. దేవాలయంలో జరిపే ఉత్సవ దినాన్ని, అమ్మవారికి జరిపే జాతర దినాన్ని తిరునాళ అంటాము. పవిత్రమైన దైవ దినాన్ని - తిరునాళ్ళను - నాడు ఎలా జరిపే వారు, నేడు ఎలా జరుపుతున్నారు అనేది మన వ్యాస విషయం. తిరునాళ్ళు ఎందుకోసం ఉద్దేశించబడిందో ఆ ఉద్దేశం మరుగున పడిపోయి జనం దాన్ని తమ విలాసం కోసం, వేడుక కోసం ఉపయోగిస్తున్నారనే వ్యథ ఈ వ్యాస శీర్షికలో కనిపిస్తుంది. చీమలు తమ భద్రత కోసం పుట్టలు పెట్టు

## వ్యక్తి అప్రధానం అయితే...



"వ్యక్తి అప్రధానం అయిన నాడు ఇం[ક] 'సంఘం' ఎక్కడ మిగులుతుంది? వ్య[క్తి] స్వేచ్ఛ ఒక్కటే స్వచ్ఛందంగా, సంపూర్ణంగ[ా] సంఘసేవకు మనిషి అంకితం అయ్యేట్టు చేయ[] గలదు. వ్యక్తి నుంచి అతని స్వేచ్ఛన[ు] హరించి వేస్తే అతడు యంత్రం అవుతాడు[,] సంఘం నాశనం చెందుతుంది. వ్యక్తి స్వేచ్ఛను నిరాకరించే ప్రాతిపదిక మీద [] సంఘాన్ని మనం సృష్టించ లేము."

-గాంధీజీ

"ఇంటి శత్రువు ఒక్కరి కంటె
బయటి శత్రువులు వందమంది నయం!" —అరబ్బీ సామెత

ఉంటే పాములు వాటిని నెలవులుగా వాడు కుంటాయి. అది సహజం!

త్యాగరాజ స్వామి ఆరాధనోత్సవాలూ, సీతాయజ్ఞాలూ మొదలైన తిరునాళ్ళు నేటికీ పుణ్యదినాలుగా గడుపబడుతున్నా, ఎక్కువ భాగం తిరునాళ్ళు సంతలుగానూ, అమ్యూజ్ మెంట్ పార్కులుగానూ, సరదాలు తీర్చు కునే రోజులుగానూ ఈ నాడు మారి పోయాయి. జ్ఞానాన్ని ఇవ్వవలసిన తిరునాళ్లు అజ్ఞానాన్ని పెంచుతున్నాయి. శివరాత్రి నాడు శివుడు గరళాన్ని మ్రింగి మూర్ఛిల్లినందుకు దుఃఖంతో రాత్రి అంతా జాగరం చేయవలసి ఉండగా, ఆ మాటే మరచిపోయి, ఈ నాడు ప్రజలు చేసే పాపకృత్యాలు విజ్ఞులకు తెలియ నివి కావు.

*          *

ఎస్. లక్ష్మణస్వామి, రాజాం.

'తిరునాళ' అంటే మంచిరోజు. జాతర, తిరుసు. ఉత్సవం, తిరునాళ అనే మాట లన్నీ ప్రజలు ఒక చోట గుమిగూడి చేసుకునే పండుగ దినాన్ని సూచిస్తాయి. ఈ రకం పండుగలు గ్రామ ప్రాంతాలలో ఎక్కువ. పుణ్యం, పురుషార్థం వాటి ప్రధాన లక్ష్యం.

దాదాపు 40, 50 సంవత్సరాల క్రితం తిరునాళ అంటే ప్రజలకు ఎక్కువ మోజుగా ఉండేది. గ్రామీణ స్త్రీలు తలలకు ఆపనూనో, నువ్వుల నూనో రాసుకుని, తల దువ్వగా దువ్వుకొని, కొప్పులో తురాయి పూలు తురిమి, రంగు రంగుల కోకలు గట్టి తిరునాళ్ళకు బయలుదేరే వారు. పురుషులు కిర్రు చెప్పులూ, తలపాగాలూ, బాణా కర్ర లతో వచ్చేవారు. జానపద నృత్యాలూ, చెక్క భజనలూ, తప్పెటగుళ్ళు, భాగవతం, హరి కథలూ, తోలుబొమ్మ లాటలూ లాంటి వినోద కాలక్షేపాలు ఎక్కువగా ఉండేవి.

---

## 70 అంతస్తుల ఎత్తున హూవర్ డామ్!



అరిజోనా (అమెరికా) లో 70 అంతస్తుల ఎత్తున నిర్మించిన హూవర్ డామ్ ప్రపంచ వింతలలో ఒకటి. 1931 లో ఆరంభించి 1936 నాటికి దాని నిర్మాణం పూర్తి చేశారు. ఈ డామ్‌లోని పెద్ద కాంక్రీట్ గోడకు ఒక వైపున కొలరాడోనది దక్షిణంగా మలుపు తిరుగుతుంది; రెండోవైపున 115 మైళ్ళ పొడవు గల 'మీడ్' సరస్సు ఉంది. 1955 దాకా మానవ కల్పితమైన సరస్సులలో ఇదే పెద్దది. దీని నిర్మాణంలో 70 లక్షల టన్నుల కాంక్రీట్ ఉపయోగించబడింది.

"సుష్టు అయిన భోజనం కావా లంటే
సూదకుణ్ణి (వంటవాణ్ణి) కసురు కోకు!"     —చెనా సామెత

తిరునాళ్ళ చూసి ఇంటికి తిరిగిపోతూ ఖర్జూరం, శనగలూ, పంచదార చిలుకలూ, లక్కపిడతలూ, రాగి, ఇత్తడి పాత్రలూ కొనుక్కొని పోయేవారు. ఆ రోజుల్లో మోసాలూ, జేబు దొంగతనాలూ, పోలీసుల హంగామా ఎక్కువగా ఉండేవి కావు.

ఈ నాటి తిరునాళ్ళలో - జనాభా పెరగడం వల్ల - సమ్మర్దం ఎక్కువయింది. వెనుకటి జానపద కళల స్థానే రికార్డింగ్ డాన్సులూ, మైక్‌ల ఆర్భాటాలూ, జూదాలూ మొదలైనవి వెలిశాయి.

వెనుక తిరునాళ్ళలో భక్తిప్రధానం. ఈ నాడు రక్తి, భుక్తి ప్రధానం అయాయి. వెనుక భారతీయ సంప్రదాయం ఉట్టిపడుతూ ఉండేది. ఈ నాడు సినీ సంస్కృతి విదేశీ అనుకరణ, శాసన విరుద్ధమైన స్వేచ్ఛా విహారం ఎక్కువగా కనిపిస్తున్నాయి.

* * *

సి. కృష్ణమూర్తి, లింగగిరి.

తిరునాళ అంటే శుభప్రదమైన రోజు. ఆ రోజున ప్రజలు ఆ తిరునాళ్ళ జరిగే పుణ్య క్షేత్రాలకు గుంపులు గుంపులుగా పోయి దైవ దర్శనం చేసుకుని కానుకలు చెల్లించేవారు. పుణ్య నదులలో స్నానాలు చేసి ఉపవాస దీక్షలతో పవిత్రంగా గడిపేవారు. కోలాటాలూ, భజనలూ, హరికథలూ, బుర్ర కథలూ వినోదంతో పాటూ భారతీయ విజ్ఞానాన్ని కూడా బోధిస్తూ ఉండేవి.

నేడు తిరునాళ్లు కేవలం వ్యాపార కేంద్రాలుగా మారిపోయాయి. దైవభక్తీ, పాపభీతీ, మనోనైర్మల్యం మచ్చుకైనా కనిపించడం లేదు. ఈ నాడు జార, చోరాది వృత్తులకు నిలయమై తిరునాళ్ళ ప్రధాన లక్ష్యం దెబ్బ తింటూంది. అంతే కాక ఆ నాడు పాటింపబడని కుల, మత, ధనిక, దరిద్ర బేదాలు ఈ నాడు పాటించబడుతూ, ఒక్కొక్క ఉత్సవం ఒక కులానికో, ఒక మతానికో అంకితం అవుతూంది. మనుష్యుల మధ్య చీలికలకూ, ఘర్షణకూ ఇవి దారి తీసునాయి.

## ఆసియాలో మిక్కిలి ఎత్తైన భవనం



సియోల్ (ద కొరియా) లోని యోయిడా తూర్పుకొసను ఆసియా అంతటిలోకీ మిక్కిలి ఎత్తైన భవనంగా నిర్మించబడుతున్న దేహాన్ ఇన్స్యూరెన్స్ కంపెనీ బిల్డింగ్ తూర్పు భాగం నిర్మాణం 1983 నవంబరు నెలలో పూర్తి అయింది. 60 అంతస్తులతో సముద్ర మట్టానికి 250 మీటర్లు ఎత్తుగా ఉండే ఈ భవన నిర్మాణం ఈ ఏడాది ఆఖరుకు పూర్తి కాగలదనీ, దీని నిర్మాణానికి 23.5 కోట్ల డాలర్లు ఖర్చు కాగలదనీ తెలుస్తూంది

"శాసనం కంటె దృష్టాంతం మంచిది!"

# కార్టూనులు గీయటం ఎలా?

టి. వెంకటరావు

## 31
## రచన - 1

1×1 2×3 1×2 3×4





ఎన్నుకొన్న చట్రం (panel) లో చిత్రం లోని వివిధ భాగాలను సరియైన తీరులో అమర్చే నేర్పును 'రచన' అంటారు.

చట్రం: చుట్టూ గీతలు లేని కార్టూన్‌లూ, చట్రంలో అమర్చని చిత్రాలూ వెలా తెలా బోతూ, ఎవ్వరినీ ఆకర్షించవు. చిత్రం చుట్టూ గీసే రేఖలనే 'చట్రం' (panel) అనవచ్చు. చట్రాలు అనేక రకాలు. కొన్ని చదరంగా ఉంటాయి. కొన్ని దీర్ఘ చతురస్రాకారంగా ఉంటాయి. కొన్ని గుండ్రంగానూ, కొన్ని

### శని గ్రహం సాంద్రత

శనిగ్రహం సాంద్రత మిక్కిలి తక్కువ. ఒక మహా సముద్రంలో దానిని పడవేయటం సాధ్యం అయితే రబ్బరు బంతిలాగ అది నీటి మీద తేలుతుందట!

"మనల్ని గురించి నలుగురూ అనుకునేదే నిజం అని తెలియడం ఎంత బాధాకరం!" —ఎల్.పి. స్మిత్

# కార్టూనులు గీయటం ఎలా?

టి. వెంకటరావు

## 31

## రచన - 1

1x1 2x3 1x2 3x4





ఎన్నుకొన్న చట్రం (panel) లో చిత్రం లోని వివిధ భాగాలను సరియైన తీరులో అమర్చే నేర్పును 'రచన' అంటారు.

చట్రం: చుట్టూ గీతలు లేని కార్టూన్‌లూ, చట్రంలో అమర్చని చిత్రాలూ వెలా తెలా బోతూ, ఎవ్వరినీ ఆకర్షించవు. చిత్రం చుట్టూ గీసే రేఖలనే 'చట్రం' (panel) అనవచ్చు. చట్రాలు అనేక రకాలు. కొన్ని చదరంగా ఉంటాయి. కొన్ని దీర్ఘ చతురస్రాకారంగా ఉంటాయి. కొన్ని గుండ్రంగానూ, కొన్ని

---

### శని గ్రహం సాంద్రత

శనిగ్రహం సాంద్రత మిక్కిలి తక్కువ. ఒక మహా సముద్రంలో దానిని పడవేయటం సాధ్యం అయితే రబ్బరు బంతిలాగ అది నీటి మీద తేలుతుందట!

---

"మనల్ని గురించి నలుగురూ అనుకునేదే నిజం అని తెలియడం ఎంత బాధాకరం!" —ఎల్.పి. స్మిత్

కోడిగుడ్డు ఆకారంగానూ కూడా ఉంటాయి. అయితే దీర్ఘ చతురస్రాకారపు చట్రాలనే ఎక్కువగా వాడుక చేస్తారు. 2″ × 3″, లేదా 3″ × 4″ చట్రాలు ఎక్కువ ఆకర్ష కంగా ఉంటాయి. చదరపు చట్రాలు ఆసక్తి కలిగించవు గీయదలచుకున్న చిత్రంలోని భాగాలకు అనుగుణంగా నిలువుగా, గాని అడ్డంగా గాని ఉండే దీర్ఘ చతురస్రాకారపు చట్రాన్ని ముందుగా ఎంచుకోవాలి. వార్తాపత్రికలలో ఒకే కాలమ్‌లో వేసే కార్టూన్‌లు నిలువుగా ఉండే దీర్ఘ చతురస్రాకారపు చట్రంలో గీయబడడం మీరు చూసే ఉంటారు. రాజకీయాల మీద కార్టూన్‌లకు సాధారణంగా అడ్డంగా ఉండే దీర్ఘ చతురస్రాకారపు చట్రాలనే వాడుతారు.

చట్రంలో మధ్యలో ఎక్కడో చిన్న బొమ్మగీసి దానిచుట్టూ ఎక్కువ ఖాళీభాగం వదలకూడదు. అయితే అవసరమైనంత ఖాళీ భాగం చుట్టూ వదలకుండా మరీ పెద్ద బొమ్మనూ గీయకూడదు. చట్రంలో ఒక మూలగా బొమ్మను గీసి 3/4 వ వంతు భాగం ఖాళీగా వదలకూడదు. తగిన విధంగా చుట్టూ స్వల్పంగా ఖాళీ జాగా వదలి చిత్రాన్ని చట్రంలో అమర్చాలి. (సశేషం)

## పేరెన్నిక గన్న పిసినిగొట్టు

18 వ శతాబ్దంలో ఇంగ్లండులో జీవించిన డేనియల్ డాన్సర్‌ని మించిన లోభి ప్రపంచంలో ఉండడు. లండన్ కి దక్షిణంగా 'హారో'లో ఉన్న భూముల మీద ఆయనకు సాలీనా 3,000 పౌన్లు ఆదాయం వచ్చేది. కడుపునిండా తిండి తినేవాడు కాడు. తన చేలకు ఎరువుకోసం రోడ్ల వెంట పోతూ పేడ ఉండలు జేబులనిండా నింపుకుని వచ్చేవాడు. ఒకసారి అతని చెల్లెలికి ప్రాణం మీదికొచ్చిందిససేమిరా డాక్టర్‌ని పిలవనన్నాడు. "దైవ సంకల్పానికి విరుద్ధంగా నా డబ్బు ఖర్చుపెట్టి నన్ను పాపం మూట కట్టుకో మంటారా?" అని ఆయన అడిగాడు.

## సుఖ వ్యాధి బాధితుల సంఖ్య పెరుగుదల



అమెరికన్ మెడికల్ అసోసియేషన్‌వారి జర్నల్‌లో అచ్చయిన ఒక సంపాదకీయం ప్రపంచంలో సుఖవ్యాధులు విపరీతమైన వేగంతో వ్యాపిస్తున్నా యని ఆందోళన ప్రకటించింది. ఏటేటా ప్రపంచంలో దాదాపు 60 లక్షల మందికి కొత్తగా సుఖవ్యాధులు సోకుతున్నాయి. సుఖవ్యాధి పీడితులలో ప్రతి 7 గురిలో ఒకడు భారతీయుడు!

"శస్త్ర వైద్యుడికి 'గ్రద్ద' చూపూ, 'సింహం' గుండె, 'స్త్రీల' వేళ్ళూ అవసరం!"

# గుండెజబ్బు రాకుండా ముందుజాగ్రత్తలు

డా॥ కె. కె. దాతే



[అంతర్జాతీయ ప్రసిద్ధి పొందిన హృద్రోగ వైద్య నిపుణులు డా॥ కె. కె. దాతే దీర్ఘకాలం వ్యాధితో బాధపడి ఇటవలనే బొంబాయిలో పరమ పదించారు.]

'చికిత్స కంటె నిరోధం ఉత్తమం!' అనే మాట గుండె జబ్బుల విషయంలో కూడా వర్తిస్తుంది. ఆందోళన, ఆరాటం పెచ్చుపెర గడం, జనాభా సమ్మర్దం, వాతావరణ కాలుష్యం వంటి మనకు తెలిసిన, తెలియని అనేక కారణాల వల్ల ఈ 20 వ శతాబ్దంలో గుండె జబ్బులు ఎక్కువయాయి. ఇంచు మించు అంటు జాడ్యాల స్థాయికి ఇవి పెరిగి పోయాయి. ప్రపంచం అంతటా ఈ నాడు గుండె జబ్బులవల్ల సంభవించే మరణాలు ఎక్కువగా ఉన్నాయి. 1925 లో అమెరికాలో గుండెజబ్బు చావులు 25 శాతం మాత్రమే ఉంటే, 1979 నాటికి 52 శాతానికి అవి పెరిగాయి.

అలాంటి ధోరణే ఇండియాలోనూ కనిపిస్తూంది. 1940 లో మృత్యువును కలిగించే వ్యాధులలో 9 వ స్థానంలో ఉన్న గుండె జబ్బు 1960 నాటికి 3 వ స్థానంలోకి వచ్చింది.

పశ్చిమ దేశాలలో గుండె జబ్బులు రాకుండా నివారించడానికి తీసుకుంటున్న చర్యలలో ప్రధానమైంది: జీవన ప్రమాణాన్ని పెంచడం ద్వారానూ, పారిశుద్ధ్యాన్ని (hygiene) మెరుగుపరచడం ద్వారానూ, గొంతువాపులను అదుపులో పెట్టడంద్వారానూ రుమేటిక్ జ్వరం (కీళ్ళవాపు జ్వరం) రాకుండా చూడడం.

గుండె జబ్బులలో పలు రకాలు ఉన్నాయి. గుండె పని చేయడంలోనే లోపం ఏర్పడి వచ్చేవీ, శరీరంలోని ఇతర అవయవాలలో ఏర్పడిన వైకల్యం వల్ల వచ్చేవీ - అని వీటిని రెండు వర్గాలుగా విభజించవచ్చును. సుమారు 30 ఏళ్ళ క్రితం ఒక పాతికేళ్ళ స్త్రీ గాని, 35 ఏళ్ళ పురుషుడు గాని రొమ్ములో నెప్పి అని

---

25 వ పుటలోని పొడుపు ప్రశ్నల జవాబులు

1. గుండు సూది. 2. సూది, 3 కుర్చీ, 4. గజం బద్ద, 5. పుస్తకం, 6. సంస్థ, 7. నది, 8. రంపం.

---

"ఆచార్యులు ప్రసరింప జేసే ప్రభావం అనంతమైంది!" —హెన్రీ ఆడమ్స్

డాక్టర్ దగ్గిరికి వెళితే, ఎంత ఆరితేరిన డాక్టరు కైనా అది గుండె జబ్బేమో అనే అనుమానమే వచ్చేది కాదు. కాని ఇవాళ పరిస్థితి పూర్తిగా వేరు!

గుండె జబ్బుల్లో కొత్త రకాలు వస్తున్నాయి. 30 ఏళ్ళ క్రితం పుట్టుకతోనే గుండెలో వైకల్యంతో పుట్టిన కుర్రవాణ్ణి పరీక్షించి డాక్టరు అది 'కార్డియో మైయోపతీ' (గుండె కండరాలలో వచ్చే జబ్బు) అని గుర్తించ లేకపోయేవాడు. ఇది ప్రత్యేకంగా కేరళ రాష్ట్రంలో ఎక్కువగా కనిపిస్తున్న ఒక కొత్త రకం గుండె జబ్బు!



సర్వ సాధారణ మైన గుండె జబ్బుల రకాలలో కొన్ని:

1. 'ఈస్కిమిక్' గుండె జబ్బు (IHD): గుండెకు సంబంధించిన రక్తనాళాలు గట్టిపడడం వల్ల ఈ వ్యాధి వస్తుంది. ఆ రక్తనాళాల లోపలి గోడలలో కొవ్వు పదార్థం చేరడం ఇందుకు కారణం.

2. 'హైపర్ టెన్సివ్' గుండె జబ్బు (HHD): రక్తపుపోటు ఎక్కువై వచ్చే గుండె జబ్బు రకం ఇది.

3. 'రుమేటిక్' గుండె జబ్బు (RHD): ఇది కీళ్ళ వాపు జ్వరం పర్యవసానంగా వచ్చే రకం గుండె జబ్బు. సాధారణంగా బాల్యం లోనే ఇది వసుంది.

4. 'పల్మనరీ' గుండెజబ్బు (PHD): ఊపిరితిత్తులలో లోపం వల్ల వచ్చే రకం గుండె జబ్బు పొగ త్రాగడం, జీర్ణించి పోయిన 'బ్రోంఖైటిస్', ధూళి, పొగ లోపలికి పీల్చడం వంటి కారణాలవల్ల ఇది వస్తుంది.

5. 'కంజెనిటల్' గుండె జబ్బు (CHD): పైన చెప్పినట్టు పుట్టుకతోనే గుండెలో లోపం ఉండడం వల్ల వచ్చే గుండె జబ్బు ఇది.

నిరోధ విధానాలు:

1. ఈస్కిమిక్ గుండె జబ్బు (IHD): ఆహారంలో కొవ్వు తక్కువగా (10 మొదలు 15 శాతం) ఉండేట్టూ, మాంస కృత్తులు సమంగా (10 మొదలు 12 శాతం) ఉండేట్టూ, పిండి పదార్థాలు తగినంతగా (70

## 7వ శతాబ్ది నాటి బుద్ధ ప్రతిమ

ద. కొరియా రాజధాని నగరం పియోల్‌కు నైరృతి దిశగా 100 కి.మీ.ల దూరంలో ద. ఛుంగ్‌ఛాంగ్ రాష్ట్రంలో 7 వ శతాబ్దం మధ్య భాగానికి చెందిన బుద్ధ విగ్రహాలు చెక్కి ఉన్న 4 ముఖాల శిల్పం ఒకటి ఇటీవల లభించింది. 'క్వేఖె' రాజవంశం హయాములో ఈ శిల్పం చెక్కబడి ఉండవచ్చు నని భావిస్తున్నారు.

---

"తన కూత వినేందుకే సూర్యుడు ఉదయించా డని
నమ్మే కోడి లాంటి వాళ్ళు కొందరుంటారు!" —జార్జ్ ఇలియట్

మొదలు 80 శాతం) ఉండేట్టూ చూసుకుంటే 'ఈస్కిమిక్' గుండె జబ్బు రాకుండా అరికట్ట వచ్చును చక్కెర, చాక్‌లెట్ లాంటి కృత్రిమాహారాలు పనికి రావు. పాలూ, పాలతో చేసిన పదార్థాలూ పరిమితంగా వాడాలి.

కొవ్వు ఎక్కువగా ఉండే మీగడ, వెన్న, నెయ్యి, జంతు సంబంధమైన కొవ్వు మొదలైనవి తగ్గించాలి. వాటి స్థానే పప్పు నూనెలు (నువ్వుల నూనె, వేరుసెనగ నూనె మొ.) వాడవచ్చును. ఉదజని (hydrogen) చేర్చబడిన నూనెలను పరిహరించాలి. 'కలెస్టరోల్' ఎక్కువగా ఉండే గ్రుడ్డు, కాలేయం, మెదడు వంటి వాటిని తినడం మానివేయాలి. ఉండవలసిన దానికంటె ఎక్కువ బరువు ఉంటే ఆహారంలో తీసుకునే కేలరీలను తగ్గించాలి. కుటుంబంలో ఇంతకు ముందు ఎవరికైనా IHD వచ్చి ఉన్న సందర్భాలలో ఆహార నియమం విధిగా పాటించాలి.

ఆరోగ్యానికి వ్యాయామం అవసరం. యోగాసనాలు వెయ్యడం ఉత్తమం. లేకపోతే రోజూ ఎక్కువ దూరం నడుస్తూ అయినా ఉండాలి. ఎవరైనా యోగాచార్యుల వద్ద యోగాసనాలూ, ప్రాణాయామం అభ్యసించండి. క్రమం తప్పని వ్యాయామంవల్ల మనం తీసుకునే అదనపు కేలరీలను కొవ్వుగా మారకుండా నిరోధించవచ్చును.

మానసికమైన ఆందోళనలూ, ఆరాటాలూ తగ్గించుకోవాలి. అయితే - ఇది కొంతవరకే సాధ్యం అవుతుంది. కాని, శవాసనం వంటి ప్రక్రియలవల్ల ఆందోళనలను అదుపులో పెట్టుకోవచ్చును.

పొగ త్రాగడం మానివేయాలి: నిజానికి ఏ రూపంలోనూ పొగాకు వాడడం మంచిది కాదు. మద్యపానం మానివేయాలి. అది సాధ్యం కాని పక్షంలో కనీసం దానిని మితంలో ఉంచుకోవాలి.

మధుమేహం(diabetes) రక్తపుపోటు, కీళ్ళవాతం (gout) వంటి వ్యాధులతో బాధ పడుతూ ఉంటే తరచు డాక్టరుచేత పరీక్ష

## బాలల సృష్టి



అందమైన పచ్చని చెట్లూ,
ఆకాశాన్నంటే కొండలూ.
విధీ, విరామం ఎరుగని సముద్రం -
అన్నీ సృష్టించాక
ఒక్క క్షణం ఆగి దేవుడు
ఇలా అనుకున్నాడు:
"ఎక్కడో ఏదో లోపం ఉంది!
ఆడుతూ, పాడుతూ, నవ్వుతూ, నవ్విస్తూ,
కేరింతలు కొట్టే బాలలు లేకపోతే
ఈ సృష్టికి నిండుతనం లేదు."
అప్పుడు దేవుడు బాలల్ని సృష్టించాడు!

---

"పరులకు సౌభాగ్యం సాధించడంలో
సాయపడేవాడే ఆదర్శవాది!" —హెన్రీ ఫోర్డ్

చేయించుకుంటూ ఆహార నియమం, వ్యాయామం, మనశ్శాంతి మొదలైన వాటి ద్వారా ఆ వ్యాధులను అదుపులో ఉంచుకుంటూ ఉండాలి. లేకపోతే అవి 'ఈస్కిమిక్' గుండె జబ్బుకు దారితీసే ప్రమాదం ఉంది.



ఔషధ రూపంలో వాడే 'టాబ్లెట్' ల లాంటి సంతాన నిరోధకాలు 'ఈస్కిమిక్' గుండె జబ్బును కలిగించే బలమైన కారణాలలో ఒకటి. అందుచేత వాటిని పరిహరించేందుకు చూడండి. ముఖ్యంగా - రక్తపు పోటుతో బాధపడేవారూ, 'లైపిడ్' లు (కొవ్వు పదార్థాలు) శరీరంలో అధికంగా ఉన్నవారూ, కుటుంబంలో ఈ వ్యాధి వచ్చే ఆనవాయితీ ఉన్నవారూ ఈ విషయమై మరింత శ్రద్ధ వహించాలి.

2. రక్తపు పోటువల్ల వచ్చే గుండె జబ్బు (HHD): తల్లి, దండ్రు లిద్దరూ గాని, ఒకరు గాని రక్తపుపోటు వ్యాధి ఉన్నవారైతే, తమ కుటుంబంలో అనూచానంగా అది వస్తూ ఉంటే చిన్నతనం నుంచే తరచు రక్తపుపోటు (blood pressure) పరీక్ష చేయించుకుంటూ ఉండడం అవసరం!

'ఈస్కిమిక్' గుండెజబ్బు విషయంలో లాగే ఈ రకం గుండెజబ్బుకీ ఆందోళనలూ, ఆరాటాలూ దోహదం చేస్తాయి. తిండి, క్రీడలు, నిద్ర వేళ తప్పకుండా చూసుకుంటూ జీవితాన్ని క్రమబద్ధం చేసుకోడం అవసరం. పైన వివరించిన శవాసనం వంటి వాటివల్ల మనశ్శాంతి చెక్కుచెదరకుండా చూసుకుంటూ ఉండాలి.

ఎక్కువ బరువు ఉంటే బరువు తగ్గించుకునే ప్రయత్నం చెయ్యండి.

'ఉప్పు' వాడకం బాగా తగ్గించండి. చేతనైతే పూర్తిగా పరిహరించండి. కళ్ళు తిరుగుతూ ఉండడం (giddiness), తలనొప్పి, నీరసం లాంటి లక్షణాలు కనిపిస్తే వెంటనే మీ డాక్టరును సంప్రదించండి. అయితే — 'రక్తపు పోటు' చడీ చప్పుడూ కాకుండా ప్రాణాలు తీయగల దనీ, సంవత్సరాల తరబడి ఎలాంటి లక్షణాలూ పైకి కనిపించక పోవచ్చు ననీ మాత్రం మరచిపోకండి.

3. రుమేటిక్ గుండెజబ్బు (RHD): ముందుగా గొంతువాచి తగ్గిన తరువాత 2, 3 వారాలకు రుమేటిక్ జ్వరం ఆరంభం అవు

---

## తల ఒక్కింటికి 100 పుస్తకాలు

సోవియట్ రష్యాలోని పబ్లిక్ లైబ్రరీలలో 500 కోట్ల పుస్తకాలూ, ప్రైవేట్ లైబ్రరీలలో 3,000 కోట్ల పుస్తకాలూ ఉన్నాయి. అంటే ఆ దేశం పౌరులలో తల ఒక్కింటికి దాదాపు 100 పుస్తకాలు ఉన్నట్టు!

"ప్రతిఫలం క్రమంగా క్షీణిస్తూ ఉండని ఉత్పాదక సాధనం 'జ్ఞానం' ఒక్కటే!" -ఎమ్. క్లార్క్

తుంది. సాధారణంగా ఇది 5-15 సం. ల మధ్య పిల్లలకే వస్తుంది. జ్వరం ఆరంభం అయే నాటికి గొంతు నొప్పిపూర్తిగా తగ్గిపోయి ఉండడం కూడా సంభవం. అందుచేత మీ పిల్లలకు తరుచు గొంతునొప్పి వస్తే అశ్రద్ధ చెయ్యకండి. వెంటనే డాక్టర్‌ని సంప్రదిం చండి.

పిల్లలకు తరుచు గొంతునొప్పి వస్తూ ఉంటే టాన్సిల్స్ ఆపరేషన్ చేయించాలి. ఆపరేషన్ తరువాత కూడా గొంతునొప్పి వస్తూ ఉంటే వానకాలం, శీతకాలం ఉన్నన్ని నాళ్ళూ పెన్సిలిన్ బిళ్ళలు గాని, సల్ఫాన్‌మైడ్ బిళ్ళలు గాని రోజు కోటి తీసుకుంటూ ఉండాలి. అవి గొంతు నొప్పి రాకుండా చేయగలవు.

రుమేటిక్ జ్వరంలో కీళ్ళు వాయడం, కీళ్ళ నొప్పులూ, చర్మంలో మార్పు రావడం కనిపిస్తాయి. ఈ జ్వరం వచ్చిన పిల్లలను పక్కమీద నుంచి లేవకుండా చూస్తూ డాక్టరు సలహాలను పూర్తిగా పాటించాలి. అయితే ఒక్కొక్కప్పుడు పైకి ఏ 'ఫ్లూ' జ్వరంలాగో, చలిజ్వరంలాగో కనిపిస్తూ ఈ రుమేటిక్ జ్వరం మోసగించడం కూడా జరుగవచ్చును. అందువల్లనే తరచు రోగనిదానంలో పొర పాట్లు జరుగుతాయి.

## న్యూయార్క్‌లోని 'స్టాట్యూ ఆఫ్ లిబర్టీ'



న్యూయార్క్ హార్బర్ మధ్య భాగంలో 12 ఎకరాల వైశాల్యం గల 'లిబర్టీ' దీవిలో 150 అ.ల ఎత్తున్న ఒక వేదిక మీద నిర్మించిన 152 అ.ల ఎత్తు గల విగ్రహం 'స్టాట్యూ ఆఫ్ లిబర్టీ'. ఫ్రెంచ్ పౌరులూ, అమెరికన్ పౌరులూ కలిపి నిర్మించిన 'స్వేచ్ఛా చిహ్నం' ఇది. గ్రానైట్, కాంక్రీట్‌లతో నిర్మించిన ఆ వేదికకు అయిన ఖర్చు అమెరికన్ పౌరులు భరించగా, ఇనుము ఉక్కులతో చేసిన విగ్రహపు చట్రానికీ, దాని మీద తాపడం చేసిన 300 రాగి రేకులకూ అయిన ఖర్చును ఫ్రెంచ్ పౌరులు భరించారు. 1886 అక్టోబరు 28 న ఇది ఆవిష్కరింప బడింది. విజిటర్‌లు వేదిక పై భాగం దాకా ఎలెక్ట్రిక్ లిఫ్ట్‌లో వెళ్ళి, అక్కడ నుంచి విగ్రహం లోపల వలయాకారంగా నిర్మించిన మెట్ల వరుస మీదుగా విగ్రహం కిరీట భాగాన్ని చేరుకోవచ్చు. అక్కడ ఏక కాలంలో 30 మంది దాకా నిలబడి న్యూయార్క్ హార్బర్ పరిసరాల సౌందర్యం తిలకించవచ్చును.

"తెలివికి మించి పుస్తకాలు చదివినవాడు శుష్క పండితుడు!" —బ్రాండర్ మాథ్యూస్

4. పల్మనరీ గుండె జబ్బు (PHD): పొగ త్రాగడం పూర్తిగా మానివేయడం లేదా తగ్గించడం, వాతావరణ కాలుష్యం ఉన్న ప్రాంతాలకు పోకుండా ఉండడం చాలా అవసరం. ప్రమాదకరమైన ధూళి ధూసరాలు వ్యాపించి ఉండే ఆస్బెస్టాస్ ఫాక్టరీ, గనులు మొ. న వాటిలో మీరు పనిచేస్తూ ఉంటే ఆ ధూళి ఊపిరితిత్తులలోకి పోకుండా 'తొడుగు' (mask) ధరించడం లాంటి ముందు జాగ్రత్త చర్యలు తీసుకోవాలి. తరచు వైద్య పరీక్షలు చేయించుకుంటూ ఉండాలి

శ్వాసకోశ సంబంధమైన ఏ వ్యాధి వచ్చినా వెంటనే దానికి చికిత్స చేయించుకోవాలి. 'ఫ్లూ' జ్వరం మొ. న వాటితో బాధపడే రోగుల సంపర్కం పరిహరించాలి. ప్రాణాయామం లాంటి యోగాభ్యాసాలు చాలా మేలు చేస్తాయి.

5. కంజెనిటల్ గుండెజబ్బు (CHD): ఈ రకం గుండెజబ్బు ప్రపంచంలో నానాటికీ పెచ్చుపెరుగుతూంది. మనం తీసుకుంటున్న కొన్ని ఔషధాలూ, ఎక్స్‌రేలూ, రేడియమ్, అణు బాంబుల 'జల్లు' (fall-out, వైటమిన్‌ల లోపం ఇందుకు ప్రధాన కారణాలు

తల్లిగర్భంలో ఉన్న శిశువు దేహంలో గుండె తయారవుతున్న దశలోనే (అంటే - గర్భధారణ అనంతరం 3 వ వారం మొదలు 8 వ వారం దాకా) ఈ వ్యాధి శిశువుకు సోకుతుంది.

ఈ వ్యాధిని కలిగించే మిక్కిలి బలమైన కారణం 'రుబెల్లా' (పొంగు వంటి వ్యాధి). 3-8 వారాల మధ్య తల్లికి ఈ వ్యాధి సోకితే గర్భ విచ్ఛిత్తి చేయించడం మంచిది.

కొన్ని ఔషధాలు సేవించడంవల్ల కూడా CHD వ్యాధి రావచ్చును. అలాంటి ఔషధాలలో 'థాలిడోమైడ్' ఒకటి. గర్భధారణ కాలంలో — ముఖ్యంగా 3 మొదలు 8 వారాల మధ్య కాలంలో — ఔషధాలను పూర్తిగా పరిహరించాలి. అలాగే ఎక్స్-రే, రేడియమ్ వంటి వాటికి కూడా దూరంగా ఉండాలి.

---

## ప్రపంచంలో మిక్కిలి భయంకరమైన జంతువు



'ష్రూ' అనబడే చిన్న ఎలుక పిల్లలాంటి 'స్తనంధయ' (mammal) జంతువు ప్రపంచంలో మిక్కిలి భయంకరమైంది. దీని పొడవు రెండు అంగుళాలే గాని, దీని కాటు తాచుపాము కాటు లాంటిది. తను ఎంత బరువు ఉంటుందో అంతకు రెండింతల బరువు గల మాంసం రోజూ అది ఆరగిస్తుంది. తన కంటె మూడింతలు పెద్దగా ఉన్న జంతువులను కూడా తోకతో అది చితక్కొట్టగలదు. దాని లాలాజలంలోని తీవ్రమైన విషం ఒక ఎలుకను 3 ని. లలో చంపివేస్తుంది.

"ఉద్గ్రంథాల కంటె ఉత్తేజకరమైంది 'నిశ్శబ్దం'" — జె.బి.ఎస్. హాల్డేన్

# భర్తీ చేయదగిన 'శక్తి' వనరులు

డా॥ ఎమ్. సి. గుప్త



[డా॥ ఎమ్.సి. గుప్త మైసూరు విశ్వ విద్యాలయంలో చదివి మెకానికల్ ఇంజనీరింగ్‌లో పట్టభద్రులు అయారు. మాంట్రీల్ (కెనడా) లోని మెక్ గిల్ యూనివర్సిటీలోనూ, పెర్‌డ్యూ (అమెరికా) యూనివర్సిటీలోనూ పిహెచ్. డి. చేశారు. ప్రస్తుతం మద్రాసులోని ఐ. ఐ. టి.లో మెకానికల్ ఇంజనీరింగ్ విభాగంలో ప్రొఫెసర్; థెర్మోడైనమిక్స్, కంబశ్చన్ ఇంజనీరింగ్‌ల లేబొరేటరీ అధిపతి. విస్తృతంగా ప్రపంచ పర్యటన చేశారు. అనేక పరిశోధక వ్యాసాలు ప్రచురించారు.]

ఈ ప్రపంచం లోని సమస్త జీవరాశికీ జీవనదాత, శక్తిదాత అని అనాది కాలం నుంచీ సూర్యుణ్ణి మనం ఆరాధిస్తూనే వచ్చినా, ప్రస్తుత కాలంలో సూర్యునిపట్ల మరింత ఎక్కువ ఆసక్తిని మనం ప్రకటిస్తున్నాము. చాలాకాలం పాటు ప్రపంచంలో కట్టెలే ప్రధానమైన శక్తి వనరు. బొగ్గు, నూనె, భూగర్భ వాయువు కనిపెట్టిన తరువాత మన జీవితాలలో విప్లవాత్మకమైన మార్పు వచ్చింది. ఈ శక్తి వనరులు పుష్కలంగా ఉన్నాయనీ, చౌక ధరలకు శాశ్వతంగా అవి మనకు లభిస్తూనే ఉండగల వనీ మనం నమ్ముతూ వచ్చాము.

అయితే నూనె. భూగర్భ వాయువు నిలువలు అతి వేగంగా హరించి పోతున్నాయనీ, మరికొన్ని దశాబ్దాలలోనే అవి పూర్తిగా వట్టిపోతాయనీ ఇప్పుడు మనకు తెలుసు. వాతావరణ కాలుష్యం ప్రపంచంలో

## బహుళార్థ సాధకం అయిన ఎడారి మొక్క

అమెరికాలోని సొనోరా ఎడారిలోనూ, మెక్సికోలోనూ విరివిగా కనిపించే 'జొజొబా' మొక్కను తెచ్చి మన దేశంలో 'థార్' ఎడారిలో పెంచవచ్చు నంటున్నారు. ఎక్కువ కాలం జీవించే ఈ మొక్కను పెంచడం తేలిక. ఈ మొక్క తాలూకు గింజల నుంచి వచ్చే నూనె కార్బన్ పేపర్లు, వార్నిష్‌లు, పాలిష్ వాక్స్‌లు, బట్టల సబ్బులు మొదలైన ఎన్నో వస్తువుల తయారీలో బాగా ఉపయోగపడుతుంది.

"ఆత్మరక్షణ ప్రకృతి సూత్రాల్లో మొదటిది." —ఎస్. బట్లర్

కొన్ని ప్రాంతాలలో ప్రమాదకరమైన స్థాయికి వచ్చి, ఈ నాడు ప్రపంచంలో అందరినీ కలవర పెడుతూంది. అందుచేత బొగ్గు (fossil) వంటి ఇంధనాల వాడుక మీద అనేక నిషేధాలు విధించవలసి వస్తూంది.

భవిష్యత్తులో పరమాణుశక్తి వాడుక విషయంలో చాలా కాలంగా కొన్ని సందేహాలు వేధిస్తున్నాయి. పరమాణు అవశేషాల



(waste) నిర్మూలన, రేడియేషన్ వల్ల ఏర్పడే ప్రమాదాలూ ఆ విషయంలో బలమైన ప్రతిబంధకాలుగా కన్పిస్తున్నాయి. అందుచేత— సముద్రపు కెరటాలూ, భూగర్భ ఉష్ణత. గాలి శక్తి. జీవ పదార్థాల నుంచి వచ్చే గాస్ (bio mass), సముద్ర జలాలలోని ఉష్ణోగ్రతల లోని మార్పులు, సౌరశక్తి మొదలైన ఎప్పటి కప్పుడు తిరిగి తిరిగి భర్తీ చేసుకోడానికి వీలైన శక్తి వనరుల వైపు మనం దృష్టిని మళ్ళించవలసి వస్తూంది ఆచరణ యోగ్యత, పరిశోధన ఇంకా జరుగవలసి ఉండడం, మన ఆర్థిక స్తోమతు, మన గ్రామీణ ప్రాంతాలలో నివసించేవారికి తక్కువ వ్యయంతో 'శక్తి'ని అందజేయవలసి ఉన్న మన బాధ్యత మొదలైన అంశాలన్నిటినీ దృష్టిలో ఉంచుకుని పైన చెప్పిన శక్తి వనరులను సూక్ష్మంగా పరిశీలించి చూస్తే వాటిలో సౌరశక్తికీ, గాలి శక్తికీ, జీవ పదార్థాల నుంచి వచ్చే గాస్‌కీ మనం అత్యధికమైన ప్రాధాన్యం ఇవ్వవలసి ఉంటుందనడం స్పష్టం. చౌకగా, లాభసాటిగా వాటిని ఉత్పాదన చేసి మన జీవన సరళిలో వాటిని ఒక భాగంగా మార్చాలంటే మన జాతీయ ప్రణాళికా సంఘం వాటికి అగ్రపీఠం వెయ్యక తప్పదు.

ఇండియాలో ఈ నాడు మనం ఎదుర్కోవలసిన సమస్యలు బ్రహ్మాండమైనవి. చూస్తూ ఉండగానే శరవేగంతో జనాభా పెరిగిపోతూంది. అలా పెరుగుతున్న జనాభాలో అత్యధిక భాగం దారిద్ర్య రేఖకు దిగువను అజ్ఞానంతో, నిరక్షరాస్యతతో, మూఢాచారాలతో అలమటించి పోతున్నారు. రెండు పూట్లా కడుపునిండా తిండికి కూడా నోచుకోని ఈ కోట్లాదిమంది అభాగ్యుల జీవితాలకు భవిష్యత్తులోని శక్తి వనరులు అర్థం కల్పించవలసి ఉంటుంది.

## పాత న్యూస్ పేపర్ల నుంచి పశువుల మేత!

కెనడాలో కొందరు శాస్త్రవేత్తలు పాత న్యూస్ పేపర్ల నుంచి ఎక్కువ ఖర్చు కాకుండా పశువులకు పుష్టికరమైన ఆహారాన్ని తయారు చేసే ప్రక్రియను కనిపెట్టారు.

"మోసగాణ్ణి మోసగించడం మోసం కాదు!"

గత కొన్ని సంవత్సరాలలో సౌరశక్తి విషయంలో జరిగిన పరిశోధనల వల్ల ఇండియాకు అది అనువైనదే ననీ, చాలా రంగాలలో బొగ్గు మొదలైన 'ఫాసిల్' ఇంధనాల స్థానే దానిని ప్రవేశ పెట్టవచ్చు ననీ రుజువైంది. పాశ్చాత్య దేశాలలో సౌరశక్తి





సంగ్రాహకాల డిజైన్‌లలోనూ, వాటి ఖరీదులను తగ్గించడంలోనూ చెప్పుకోదగినంత అభివృద్ధిని సాధించారు. అమెరికా, ఆస్ట్రేలియా వంటి అనేక దేశాలలో వేలాది ఇళ్ళలో సౌరశక్తితో నీళ్ళు కాచుకునే పరికరాలు అమర్చబడ్డాయి. ఇతర ఇంధనాలు మిక్కిలి ప్రియం అయిన ఆస్ట్రేలియా ఖండపు ఉత్తర ప్రాంతాలలో చట్టరీత్యా కొత్తగా కట్టే భవనాలన్నిటిలోనూ సౌరశక్తితో పనిచేసే వాటర్ హీటర్‌లు విధిగా అమర్చి తీరాలి. సౌరశక్తి వాటర్ హీటర్‌ల పరిశ్రమ ఏటా కోట్ల డాలర్లమీద వ్యాపారం చేస్తుంది.

పంటలను ఆరబెట్టేందుకై గాలిని వేడి చేయడానికీ, తడి ఆర్చవలసి ఉన్న అలాంటి అనేక ఇతర ప్రయోజనాలకూ సౌరశక్తి గ్రాహకాలు వాడుకలో ఉన్నాయి. ఉష్ణమండల దేశాలకు శీతలీకరణ యంత్రాలూ, రిఫ్రిజిరేటర్‌లూ కూడా ఎక్కువగా అవసరం. అందుచేత సౌరశక్తితో పనిచేసే శీతలీకరణ యంత్రాలూ, రిఫ్రిజిరేటర్‌లూ తయారు చేశారు. ఆరంభ దశలో ప్రస్తుతం వాటి ధరలు ఎక్కువగానే ఉన్నాయి. ముఖ్యంగా సౌరశక్తిని నిలువచేసే సౌకర్యం ఏర్పడక పోవడం, సాంకేతికంగా గాని, వ్యయాన్ని తగించడంలో గాని ఇంకా తగినంత అభివృద్ధి సాధించలేక పోవడం ఈ రంగంలో పెద్ద ప్రతిబంధకంగా ఉంది. వర్ధమాన దేశాలలో పంటలకూ, మనం త్రాగేందుకూ బావులనుంచి నీరుతోడే పరికరాల అవసరం చాలా ఉంది. సౌరశక్తి పంప్‌లను

## కుజ గ్రహంలో గాలి దుమారాలు

కుజగ్రహం ఉపరితల పరిశోధన కోసం అమెరికా పంపిన వైకింగ్ - 1 1976 జూలై 20 న కుజ గ్రహం మీద దిగింది మొదలు 1983 మే 22 న పవర్ సప్లై అంతమై మౌనం వహించే వరకూ 20 లక్షల వాతావరణ నివేదికలనూ, వేలాది ఫొటోలనూ భూమి మీదికి ప్రసారం చేసింది. రాళ్ళతో నిండి ఉన్న కుజగ్రహం మీద తరచు ధూళిని ఎగజిమ్మే గాలి దుమారాలు లేస్తూ ఉంటాయి. ఉష్ణోగ్రత —31° ల నుంచి —87° ల దాకా మారుతూ ఉంటుంది.

"మోసగాడికి ఎన్నడూ మోక్షం లేదు."

రూపొందించడంలో ఇటీవలి సంవత్సరాలలో చెప్పుకోదగినంత అభివృద్ధి సాధించబడింది. ఈ యంత్రాలు ఇటు ఫొటో వోల్టాయిక్ ఘటాలతో విద్యుచ్ఛక్తి మీదా పనిచేస్తాయి. అటు సౌరశక్తి హీటర్లతోనూ పనిచేస్తాయి. సౌరశక్తి నుంచి విద్యుచ్ఛక్తి నుత్పాదించే



విషయంలో అనేక ఆలోచనలు ఉన్నాయి. వాటిలో మిక్కిలి ఆశావహంగా కనిపిస్తున్నది ఫొటో వోల్టాయిక్ ప్రక్రియలూ, ఉష్ణతా శక్తి ప్రక్రియలూ। అమెరికావంటి అభివృద్ధి చెందిన దేశాలలో కొద్ది కిలోవాట్లు మొదలు కొన్ని మెగావాట్ల దాకా విద్యుచ్ఛక్తిని ఉత్పాదించే 'సౌర ఉష్ణతా విద్యు దుత్పాదక యంత్రాలు' (solar thermal electric power plants) అమరుస్తున్నారు. ఫొటో వోల్టాయిక్ ప్రక్రియ నుపయోగించి సౌర శక్తిని నేరుగా విద్యుచ్ఛక్తిగా మార్చే పద్ధతి చాలా ఆకర్షకంగానూ, సౌకర్యంగానూ కనిపిస్తూంది. ఇటీవల సాధించిన అభివృద్ధి ఫొటో వోల్టాయిక్ ఘటాల ఖరీదులను బాగా తగ్గించ గలిగింది. త్వరలో విద్యుచ్ఛక్తి ఉత్పాదనతో అవలంబిస్తున్న సాంప్రదాయిక పద్ధతులతో ఇది పోటీ పడగల దనే ఆశ కూడా కలుగు తూంది. సూర్యుని ఉపగ్రహాల నుంచి విద్యుచ్ఛక్తిని సాధించా లనే ఆలోచన కేవలం ఆలోచనగానే ఆగిపోలేదు. నేషనల్ ఏరో నాటిక్స్ స్పేస్ అడ్మినిస్ట్రేషన్ (NASA), అమెరికా ప్రభుత్వపు 'ఎనర్జీ' శాఖా కలసి భూమి కక్ష్యలో భూమి వేగంతో పరిభ్ర మించే ఒక సూర్య ఉపగ్రహాన్ని అంత రిక్షంలోకి పంపే ప్రాజెక్ట్‌ను చేబట్టాయి.

అంతగా అభివృద్ధి చెందని దేశాలలో శక్తి సరఫరాకు 'గాలి మర' ఆకర్షకమైన సాధనంగా కనిపిస్తూంది. ఇది సరళమైంది; విశ్వసనీయ మైంది; నిర్వహణ వ్యయం ఇంచుమించు ఏమాత్రం లేనిది. అనేక రకాల 'గాలి మర'ల డిజైన్లు తయారుగా ఉన్నాయి. వీటిని స్థానిక కార్ఖానాలలో తయారు చేసుకో వచ్చును. వీలైనంతవరకూ దేశీయమైన, లేదా స్థానికంగా లభించే పదార్థాలతోనూ, సాంకేతిక పరిజ్ఞానంతోనూ నిర్మించగల

## 15 అ.ల పొడుగు ఎదిగే పువ్వు!

సుమత్రా (ఇండోనేషియాలోని ఒక పెద్ద దీవి) అడవులలో కనిపించే 'క్రూబీ' పువ్వు ఎంత పెద్ద దంటే ఒక మనిషి భుజాల మీద మరొక మనిషి నుంచున్నా దాని కొస అందదు. 15 అ.ల పొడుగు దాకా ఆ పువ్వు ఎదుగుతుంది.

"పరుల మీద బురద చల్లేవాడు
తాను పూర్తిగా బురదలో మునుగుతాడు।"

'గాలిమర' డిజైన్‌లను రూపొందించడానికి మన ప్లానింగ్‌లో అత్యధికమైన ప్రాధాన్యం ఇవ్వాలి.

చెట్లు, పంటలు, ఎరువులు, సముద్రపు నాచు మొదలైన 'కిరణజన్య సంయోగ క్రియ' (photosynthesis)తో శక్తిని సేకరించి నిలువచేసే సేంద్రియ పదార్థాన్ని (organic matter) 'బయోమాస్' అంటారు. పరివర్తన ప్రక్రియల ద్వారా వీటిలోని 'గాస్', 'ఆవిరి', 'ఉదజని', 'మెథేన్'వంటి శక్తి రూపాలను బహిర్గతం చేయవచ్చును. ఇండియాలో పటిష్ఠమైన, ప్రశస్తమైన 'బయోగాస్ డైజెస్టర్' లను రూపొందించారు. ఇవి వంటకూ, దీపాలకూ, కార్లకూ పనికి వచ్చే 'మెథేన్' గాస్‌ని ఉత్పత్తి చేస్తాయి. ఇప్పుడు జరుగవలసిందల్లా బయోగాస్ యంత్రాలను భారీ ఎత్తున మన పల్లెలలో నెలకొల్పడం! బ్రెజిల్ (ద. అమెరికా) వంటి పలు దేశాలు 'బయోమాస్' నుంచి 'ఎథెనాల్'ను రాబట్టే విషయమై ఎక్కువ ఆసక్తి ప్రదర్శిస్తున్నాయి.

సౌరశక్తి పుష్కలంగా లభించే ఉష్ణమండల ప్రాంతాలలో వంటచెరకు కోసం చెట్లను పెంచడం ఆచరణ సాధ్యమైన మరొక పద్ధతి. సాగుకు యోగ్యమైన బంజరు భూములలో ఇలాంటి మొక్కలు నాటవచ్చును.

తలసరి 'శక్తి' వాడకం మిక్కిలి తక్కువగా ఉండడమేకాక, రెండు పూట్లా ఇంట్లో వంటకు వంటచెరకు కొనుక్కునే స్తోమతు కూడా లేని వారే అధిక సంఖ్యాకులుగా ఉన్న మన ఇండియా వంటి దేశంలో సూర్యుడు, గాలి, బయోమాస్ – ఈ మూడు శక్తి వనరులనూ ఉపయోగించుకోడం ఎంత లాభదాయకమో మనలో ప్రతి ఒక్కరూ గుర్తించడం చాలా అవసరం. దురదృష్టవశాత్తు అనాలోచితంగా అడవులు నరికివేస్తూ ఉండడం పరిస్థితిని మరింత విషమం చేస్తోంది.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలూ, పరిశ్రమలూ, ప సంస్థలూ అందరూ ఏకమై 'శక్తి' విషయంలో ఇండియాలో ఏర్పడిన గడ్డు పరిస్థితిని అధిగమించేందుకు క్రమబద్ధమైన కృషికి నడుం కట్టవలసి ఉంది.

## అరచేతి సైజు బిడ్డ!



3 నెలలు ముందుగా—గర్భవతి అయి 25 వ వారంలోనే—పుట్టిన ఆంజెలా ఫే అనే బిడ్డ డాక్టరుగారి అరచేతిలో స పోయింది. రోమ్‌కు ఈశాన్యంగా 18 కి.మీ. ల దూరాన ఉన్న పెరామోలోని ఒ మ్యునిసిపల్ ఆసుపత్రితో ఒక ఇన్‌క బేటర్‌లో ఆ శిశువు పెరిగింది. తల్లిదండ్రు ఆశ వదలుకున్నా, చిత్రంగా ఆ శిశువు గండ గడిచి బయటపడింది.

# ప్రపంచ వార్తలు

## ఆఫ్రికాలో నిరక్షరాస్యుల పెరుగుదల:

ఆఫ్రికాలోని 'రీజియనల్ బ్యూరో ఆఫ్ ఎడ్యుకేషన్ అండ్ డెవలప్‌మెంట్' డైరెక్టర్ బాబా హైదరా ప్రకటన ప్రకారం 1980 లో ఆఫ్రికాలో బడికి పోయే వయస్సులో ఉండి బడికి వెళ్ళని పిల్లల సంఖ్య 2.7 కోట్లు. నిరక్షరాస్యులైన వయోజనుల సంఖ్య 1970 లో 13.4 కోట్లు ఉండగా, 1980 లో 15.6 కోట్లకు అది పెరిగినట్లు ఆయన పేర్కొన్నారు.

* * *

## మిక్కిలి ప్రాచీనమైన వేల్ చేప:

5 కోట్ల ఏళ్ళ నాటి వేల్ చేప తాలూకు ిలాస్థులను తాము కనుగొన్నట్లు శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. భూమి మీది స్తనంధయ ంతువులకూ, వేల్ చేపలకూ నడిమి అను ంధం (missing link) అని ఈ చేపను ారు వర్ణిస్తున్నారు. 6 అ. ల పొడవు గల ఈ భూచరం చేపల వేటకు సముద్రంలోకి ళ్ళేది. దీని పుర్రెలో సగ భాగం, క్రింది ిడ, పళ్ళ వరుసలూ పాకిస్తాన్‌లో దొరి యి. మిచిగన్ విశ్వవిద్యాలయం తాలూకు ా॥ ఫిలిప్ డి. జింజరిఛ్ కథనం ప్రకారం

## నీ శరీరంలో వెలిగే దీపం నీ కన్ను!



"వెలిగించిన దీపాన్ని ఎవ్వరూ ఏ అల మరలోనో, ఏ కుంచంలోపలో మూసి పెట్టరు. పెమ్మామీద పెడతారు — అందరికీ కనిపించేట్టు! నీ శరీరంలో వెలిగించిన దీపాలు నీ కళ్ళు! నీ కన్ను స్వచ్ఛంగా ఉంటే నీ శరీరం అంతటా వెలుగు ప్రసరిస్తుంది. అది కొడిగడితే నీ శరీరం అంధకార మయం అవుతుంది. అందుచేత—నీ శరీరంలో ఉన్న ఈ దీపం కొడిగట్టకుండా చూసుకో! శరీరం అంతా కాంతితో ప్రకాశించేట్టు చేసుకో!"

—ఏసుక్రీస్తు

"తనకు అర్థం కాని వాటిలో మనిషికి మరింత నమ్మకం!"

'వేల్' చేప యొక్క మిక్కిలి ప్రాచీనమైన స్వరూపాన్ని ఈ శిలాస్థులు సూచిస్తున్నాయి. దీని మెదడు మరింత చిన్నది. దీనికి తోడేలు ముటె వంటి పొడవైన ముటె ఉండేది.

## మిక్కిలి పొడవైన భూగర్భ సురంగ మార్గం:

జపాన్‌లోని 'ట్సురుగా' జల సంధి అడుగున దూరం నుంచి కంట్రోల్ చేసే 'డైనమైట్ ఛార్జ్' సాయంతో ప్రపంచంలో మిక్కిలి పొడవైన భూగర్భ సురంగ మార్గం నిర్మించారు. 53.85 కి.మీ.ల పొడవున్న ఈ 'సైకాన్ టన్నెల్' జపాన్ ప్రధాన దీవి 'హోన్షూ'ను ఉత్తర ప్రాంత దీవులతో కలుపుతూంది.

* * *

## తూ. జర్మనీలో ప్రధానమైన శక్తి వనరు:

తూ.జర్మనీలో ఎక్కువగా లభించే లిగ్నైట్ క్రీ.శ. 2,000 వ సంవత్సరం తర్వాత కూడా అక్కడ ప్రధానమైన శక్తి వనరుగా ఉండగలదు. ఆ దేశంలో వాడే విద్యుచ్ఛక్తిలో అధిక భాగం 'లిగ్నైట్' నుంచే ఉత్పత్తి అవుతూంది. అది గాక అక్కడి ప్రజల ఉపయోగం కోసం, విదేశాలకు ఎగుమతి చేసేందుకూ 5 కోట్ల టన్నుల బ్రికెట్‌ల (చిన్న ఇటికల) తయారీ కూడా లిగ్నైట్‌తోనే జరుగుతూంది.

## మిక్కిలి ఎక్కువ ఆశాభావం గల దేశం:

భవిష్యత్తు విషయంలో ఎక్కువ ఆశా

## కంప్యూటరైజ్ చేయబడిన మొట్టమొదటి భవనం



కనెక్టికట్ (అమెరికా) లోని హార్ట్‌ఫర్డ్ వద్ద నిర్మించిన 'పిటీ పాలెస్' మొట్టమొదటిసారిగా కంప్యూటరైజ్ చేయబడింది. భవనంలోకి ఉష్ణోగ్రతను ఒక స్థాయిలో నిలిపి ఉంచడం, లైట్లు, లిఫ్ట్‌లు, ఇంటర్ కామ్ మొదలైన వాటిని నిర్వహించడం - అన్నీ ఈ భవనంలో కంప్యూటరే చేస్తుంది. కేంద్ర స్థానంలో ఉండే ఆ కంప్యూటర్ తల వెంట్రుక కంటె సన్నంగా ఉండే ఆప్టికల్ ఫైబర్స్ ద్వారా ఈ పను లన్నీ నిర్వహిస్తుంది. మనిషి గదిలోకి వెళ్ళగానే తమంత తామే లైట్‌లు వెలుగుతాయి. గదిని వదలిన 12 ని. లకు మళ్ళీ ఆరిపోతాయి.

—'శ్పాన్' సౌజన్యంతో.

"సంతోషాన్ని మించిన సౌందర్య సాధనం లేదు."

భావం కలిగి ఉండడంలో వివిధ ప్రపంచ దేశాలలో జరిపిన అంతర్జాతీయ గాలప్ సర్వే ననుసరించి ఆ విషయంలో ఇండియా 7 వ స్థానంలో ఉంది. సర్వే జరిపిన 30 దేశాల లోనూ 13 దేశాలలో మాత్రమే ఆశాభావం కనిపించింది. తక్కినవి నిరాశా, నిస్పృహ లతో అలమటిస్తున్నాయి. ఫ్రాన్స్, పశ్చిమ జర్మనీ, స్వీడెన్, డెన్మార్క్, ఆస్ట్రేలియా, హాలెండ్, పెరూ ఇవి అన్నీ ఆ రెండో వర్గానికి చెందినవే! ఆశాభావం గల దేశాలలో అగ్రస్థానం గ్రీస్‌ది!

* * *

## నైల్ లోయలో దొరకిన 7,000 ఏళ్ల నాటి శిల్పం:

హైడెల్ బర్గ్ (ప. జర్మనీ) కి చెందిన సుప్రసిద్ధ చరిత్ర పూర్వయుగ విజ్ఞాని ఈజిప్ట్ లోని నైల్ నదీ లోయ పశ్చిమ భాగంలో 7,000 ఏళ్ళ నాటి ఒక మానవ శిరస్సు శిల్పం తాలూకు భాగాలను కనుగొన్నారు. దాదాపు ఒక నిప్పుకోడి గుడ్డు అంత ప్రమాణంలో ఉన్న ఆ శిల్పాన్ని నైల్ నదిలోని బురదతో తయారుచేసి, కాల్చారు.

* * *

## ఫైబర్ కాంతి కిరణంతో కూడిన నేత్ర శస్త్ర చికిత్సా పరికరం:

మిక్కిలి జటిలమైన కళ్ళ ఆపరేషన్‌లలో ఉపయోగపడే ఫైబర్ కాంతి కిరణంతో కూడిన ఒక క్రొత్త శస్త్రచికిత్సా పరికరాన్ని మాస్కోలోని నిపుణులు తయారు చేశారు. మామూలు స్కాల్పెల్ (ఒక రకం శస్త్రం- scalpel) రూపంలో ఉండే ఈ పరికరం కొసనుంచి 'చల్లని' ఫైబర్ కాంతి కిరణం అప్పుడప్పుడు వెలువడుతూ ఉంటుంది. దాని కాంతి తీవ్రత 10,000 'లక్స్'లు.

## 'ప్రభూ! కష్ట సుఖాలను తేలికగా తీసుకునే ధైర్యం ఇయ్యి!'



"ప్రభూ! నాలో 'అహంకార' వృక్షం
వేళ్ళు తెగ నరుకు!
'లోభం' అనే చెట్టు వేళ్ళు తెగ నరుకు!
కష్టాలూ, సుఖాలూ తేలికగా
తీసుకునే ధైర్యం ఇయ్యి!
సేవారూపంలో నా 'ప్రేమ'ను
పండించుకునే శక్తి ఇయ్యి!
'దర్పం' బలం ముందు మోకరిల్లకుండా
దరిద్రుల్ని ఆలింగనం చేసుకునే శక్తి ఇయ్యి!
సంతోషంగా నీ 'సంకల్పానికి' తలఒగ్గి
ఆత్మార్పణ చేసుకునే గుండె దిటవు ఇయ్యి!
ఇదే-ఇదే-ఇది ఒక్కటే నా ప్రార్థన!"

—రవీంద్రనాథ్ ఠాకూర్

# దంతసంరక్షణకు అవసరమైన జాగ్రత్తలు

డా. బి. ఎల్. ఎన్. రావ్

దంతాలు ఆరోగ్యంగా ఉండడానికి నిరోధక చర్యలు తీసుకోడం చిగుళ్ళలో 'కాల్షియమ్' చేరే సమయం నుంచే ఆరంభం



కావాలి. పాలపళ్ళ (deciduous teeth) లో ఎనామిల్ చేరడం శిశువు గర్భంలో ఉన్నప్పుడే ఆరంభం అవుతుంది. శాశ్వతమైన పళ్ళలో ఎనామిల్ చేరడం శిశువు జన్మించిన మరుక్షణం నుంచి మొదలవుతుంది. అందుచేత పుట్టబోయే శిశువు దంతాలు ఆరోగ్యంగా ఉండాలంటే తల్లికి గర్భిణీ దశలో ఎక్కువ మాంసకృత్తులూ, కాల్షియమ్, భాస్వరం, వైటమిన్‌లూ సరఫరా అయేట్టు చూడాలి. అప్పుడే గర్భంలోని శిశువుకు ఆరోగ్యంగా పెరిగేందుకు అవసరమైన పోషక పదార్థా లన్నీ సక్రమంగా లభించగలవు. సాధారణంగా గర్భంలోని శిశువు తల్లి రక్తం నుంచి పోషక పదార్థాలను గ్రహించే కాలంలోనే పాలపళ్ళు ఏర్పడు

తాయి. తల్లికి పోషణ సరిగా జరుగకపోతే, లేదా గర్భవతిగా ఉండగా ఆమెకు తీవ్రమైన సుస్తీ చేస్తే శిశువులో ఎనామిల్ లోపం ఏర్పడుతుంది.

శరీరారోగ్యం సక్రమంగా లేకపోతే పళ్ళ

---

(12 వ పేజీ తరువాయి)

నయాగరాకు 11 కి.మీ. ల దూరాన ఉన్న లీవిస్ టౌన్‌లో జరిగిందట. 18 వ శతాబ్దం చివర కేతరిన్ హస్లర్ అనే ఆమె పక్కన ఉన్న ఒక కోడిపుంజు బొమ్మ తాలూకు తోక ఈకను తీసుకుని జిన్, వైన్‌లు కలిపిన పానీయాన్ని కలిపిందట. అప్పటినుంచే వివిధ మద్యాల మిశ్రణానికి 'కాక్‌టెయిల్' అనే పేరు వచ్చిందట. ఇది కేవలం కాకమ్మ కథే కావచ్చును. అయినా రోజంతా ఉత్సాహంగా నయాగరాలో గడిపి అలసిపోయి ఉన్న ప్రాణులకు ఆశ్వాసం కలిగించే సరదా అయిన కథ.

"సూర్యుడు అడుగు పెట్టిన చోట డాక్టరు అడుగుపెట్టడు."

నిర్మాణమూ దెబ్బతింటుంది. శిశువు ఆరోగ్యం సక్రమంగా ఉండా లంటే తల్లిపాలు ఇస్తూ ఉండడం (breast feeding) చాలా అవసరం. శిశు ప్రాయంలో వచ్చే చాలా జబ్బులను నిరోధించే రక్షక జీవ కణాలు (anti-bodies) తల్లిపాల ద్వారానే శిశువుకు లభించగలవు. తల్లి రొమ్ము చీకేటప్పుడు దౌడలకు లభించే వ్యాయామం దౌడలు సక్రమంగా రూపొందేందుకు తోడ్పడుతుంది. దౌడలు, తాలువు (palate) అడ్డంగా విస్తరించడానికి ఆ విధమైన వ్యాయామం చాలా అవసరం. ముఖ కవళికలు అందంగా రూపొందడానికి కూడా తల్లి రొమ్ము చీకడం తోడ్పడుతుంది. అంతేకాక ఊపిరితిత్తులు బలపడడానికీ, శిశువులోని చీకే సహజ ప్రవృత్తి (instinct) ని తృప్తి పరచడానికీ కూడా అది ఉపయోగపడుతుంది. ఆ ప్రవృత్తి సరిగా తృప్తిపడనప్పుడే పిల్లలకు నోట్లో వేలు వేసుకోడం, ఖాళీ పీకెను నోట్లో పెట్టుకుని చీకుతూ ఉండడం వంటి దురలవాట్లు అవుతాయి.

పాలపళ్ళలో మొదటి రెండు పళ్ళూ సాధారణంగా శిశువుకి 6 నెలల ప్రాయంలో వస్తాయి. క్రింది కొరుకుడు పళ్ళే మామూలుగా ముందు వస్తాయి. 15 నెలల ప్రాయంలో పాల దంతాలూ, ఆ తరువాత కోరపళ్ళూ కనిపిస్తాయి. సాధారణంగా 6 నెలల తరువాత గాని ఇంకో జంట దంతాలు చిగుళ్ళ నుంచి బయటికి రావు. దౌడ ఎముక విస్తరించడానికి ఆ మాత్రం వ్యవధి అవసరం. సాధారణంగా 2 లేదా 2½ ఏళ్ళ వయస్సు వచ్చేసరికి శిశువు తాలూకు పాల పళ్ళన్నీ (మొత్తం 20) వచ్చేస్తాయి. పెరిగే శిశువు ఆహారావసరాలను అనుసరించి క్రమంగా ఈ పళ్ళు మొలవడం జరుగుతుంది.

శాశ్వతమైన పళ్ళు మొలిచే ప్రక్రియ 6 వ ఏడు మొదలు 18 వ యేడు వచ్చే దాకా కొనసాగుతుంది. పాలపళ్ళు ఊడిపోయే ముందు శాశ్వతమైన దంతాలు పాల దంతాలకు వెనుక భాగంలో కనిపిస్తాయి. తల్లిదండ్రులు సాధారణంగా ఇవి కూడా పాల పళ్ళే అని భ్రమపడుతూ ఉంటారు. చిన్నతనం నుంచే శిశువు పోషణ సరిగా జరుగకపోతే మొట్టమొదట వచ్చే ఆ శాశ్వత దంతాల

## సౌర శక్తితో నడిచే కారు మీద 4,000 కి.మీ. ల యాత్ర



హాల్‌స్ట్రిప్, లేరీ పెర్కిన్స్ అనే ఇద్దరు ఆస్ట్రేలియన్‌లు పూర్తిగా సౌర శక్తితోనే నడిచే ఒక చిన్న కారులో ఆస్ట్రేలియా ఖండం ఈ చివర నుంచి ఆ చివరకు 4,000 కి.మీ. ల దూరం ప్రయాణించారు. 'ది క్వయెట్ అచీవర్' అనే పేరు గల ఈ కారు 20 రోజులలో 172 గం. లలో ఈ ప్రయాణాన్ని ముగించింది.

లోనే దంత క్షయ వ్యాధి (dental caries) చోటు చేసుకుంటుంది. పాలపళ్ళు ఊడి పోవడం 6½ ఏళ్ళ నుంచి 7 ఏళ్లు వచ్చేలోగా ఆరంభం అవుతుంది. విజ్ఞాన దంతాలు సాధారణంగా 18 వ ఏడు తరువాతనే వస్తాయి. అప్పటికి గాని 32 పళ్ళూ పూర్తిగా ఏర్పడడం జరుగదు.

దంత వ్యాధులలో తరచుగా కనిపించేవి: దంత క్షయ వ్యాధులూ (dental caries), చిగుళ్ళ వ్యాధులూ, (periodontal diseases). మొదటి రకం చిన్న పిల్లలకూ, రెండో రకం మధ్యవయస్కులకూ మాత్రమే వస్తాయనే నియమం ఏమీ లేదు. వ్యాధి కలిగించే సూక్ష్మక్రిములు (microbes) చేరడం వల్ల దంత క్షయ వ్యాధి వస్తుంది. చిగుళ్ళ వ్యాధులవల్ల దంతాలకు ఆధారభూతాలు అయిన భాగాలు దెబ్బతింటాయి. ఈ 'దంత క్షయం' ఆరంభం అయ్యే ప్రక్రియ విషయంలో అభిప్రాయ భేదాలు ఉన్నా, సూక్ష్మక్రిములు ఉత్పత్తి చేసే లాక్టిక్ ఆమ్లం వల్ల దంతాల మీది ఎనామిల్ దెబ్బ తినడం వల్లనే ఈ వ్యాధి వస్తుందని అందరూ అంగీకరిస్తున్నారు. పళ్ళలో ఏర్పడిన పగుళ్ళలోనూ, గుంటలలోనూ, పళ్ళ సందులలోనూ లాక్టిక్ ఆమ్లాన్ని ఉత్పత్తి చేసే కొన్ని రకాల సూక్ష్మ క్రిములు చేరుతాయి. ఆ సూక్ష్మ క్రిములను 'ప్లేక్స్' అంటారు. ప్రధానంగా సూక్ష్మ క్రిములూ, ఆ క్రిములు ఉత్పత్తి చేసే పదార్థాలూ, పళ్ళ సందుల్లో ఇరుక్కున్న ఆహార పదార్థాల అవశేషాలూ, లాలాజలంలోని నత్రజనితో కూడిన జిగురు పదార్థం కలిపి ఈ 'ప్లేక్స్' ఏర్పడుతాయి. సూక్ష్మ క్రిములు పళ్ళలో ఇరుక్కున్న పిండిపదార్థాలలో ప్రవేశించి వాటిని కుళ్ళబెట్టి పళ్ళ మీది ఎనామిల్‌ను హరించడానికి తగినంత లాక్టిక్ ఆమ్లాన్ని తయారుచేస్తాయి. జరిపిన ప్రయోగాలన్నిటి వల్లా 'డెంటల్ ప్లేక్'లే దంతక్షయ వ్యాధికి ప్రధాన హేతువని స్పష్టంగా నిరూపించబడింది. ఆహారంలో తీసుకునే పిండిపదార్థాల తాలూకు పరిమాణం కాక, వాటి స్వభావమే ఈ వ్యాధిని కలిగించడంలో ప్రాముఖ్యం వహిస్తుంది. భోజనానికీ, భోజనానికీ మధ్య

---

## 25 అ.ల పొడవున్న రెక్కలు గల పక్షి



లాస్ ఏంజెల్స్ (అమెరికా) కౌంటీ లోని 'నేచురల్ హిస్టరీ మ్యూజియమ్'లో అతి ప్రాచీన కాలానికి చెందిన మిక్కిలి పెద్ద పక్షి తాలూకు కాలూ, రెక్క ఎముకలూ, పుర్రెలో భాగాలూ భద్రపరిచారు. 50 లక్షలు మొదలు 80 లక్షల ఏళ్ళ క్రితం ద. అమెరికాలో జీవించిన ఈ పక్షి 150 పౌన్లు బరువుండేది. రెక్కలు విప్పినపుడు దాని రెక్క పొడవు 25 అ.లు ఉండేది.

"వయస్సులో నేర్చుకున్నది రాతి మీద చెక్కిన చెక్కడంతో సమానం!"

ఛూయింగ్ గమ్ వంటి జిగురుతో కూడిన చక్కెర బిళ్ళలు చప్పరించే వారిలో ఈ వ్యాధి ఎక్కువగా కనిపిస్తూంది. 'సుక్రోజ్' (చక్కెర) ఉన్న ఛూయింగ్ గమ్, అది లేని ఛూయింగ్‌గమ్ విడి విడిగా ఇచ్చి ప్రయోగాలు జరిపి చూశారు. సుక్రోజ్‌తో కూడిన ఛూయింగ్ గమ్ తీసుకొన్న వారిలో ఈ వ్యాధి ఎక్కువగా కనిపించింది. ముఖ్యంగా పిల్లలకు జిగురుతోనూ, చక్కెరతోనూ కూడిన పిండిపదార్థాల వాడకం తగ్గించడం ఈ వ్యాధి నిరోధానికి మిక్కిలి అవసరం. 2-4 ఏళ్ళ వయస్సు పిల్లలు కొందరిలో చాలా తీవ్రమైన దంతక్షయ వ్యాధి రకం కనిపిస్తూంది. పాల సీసాలను సక్రమంగా శుభ్రపరచక పోవడం, పడుకోబోయే ముందు చక్కెర ఎక్కువగా కలిసిన ఆహారం ఇవ్వడం ఇందుకు కారణం అనవచ్చును. తీసుకునే ఆహారంలో పోషక పదార్థాలు ఉండడం ఒక్కటే చాలదు. మింగే ముందు బాగా నమలవలసిన అవసరాన్ని కలిగించే పీచుపదార్థం కూడా ఆహారంలో ఎక్కువగా ఉండాలి. పచ్చి కేరట్ దుంపలను నమిలే అలవాటు వల్ల దంతక్షయ వ్యాధి రాకుండా నిరోధించవచ్చును.

చిన్నపిల్లలు రోజూ రెండుసార్లు పళ్ళను విధిగా శుభ్రపరచుకునే అలవాటు చేసుకోవాలి. అందుకు 'ఫ్లోరైడ్' కలసిన టూత్‌పేస్ట్ వాడవచ్చును. ఎదిగే వయస్సు పిల్లలూ, గర్భిణీ స్త్రీలూ కాల్షియమ్, విటమిన్‌లూ, మాంసకృత్తులూ తగినంత ఎక్కువగా తీసుకుంటూ ఉండాలి. పిల్లలకు రోజూ కనీసం రెండు కప్పుల పాలు ఇవ్వాలి. పాల నుంచి వచ్చే పెరుగు, జున్ను మొదలైనవి కూడా మంచివే! 10 లక్షల భాగాలకు 2 భాగాల చొప్పున ఫ్లోరైడ్ చేర్చిన మంచినీరు త్రాగడం దంతక్షయ వ్యాధి రాకుండా నిరోధిస్తుంది. దంతక్షయ వ్యాధి మొదలయిందేమో చూడడానికి చిన్న పిల్లలను అప్పుడప్పుడు దంతవైద్యులకు చూపిస్తూ ఉండాలి.

---

## ఆర్థిక సౌభాగ్య లక్ష్మికి ఆధునిక ఆలయం!



మధుర (ఉ.ప్రదేశ్) లోని 60 లక్షల టన్నుల శక్తి గల నూనె శుద్ధి కర్మాగారం ఆర్థిక సౌభాగ్యలక్ష్మికి ఆధునిక ఆలయం అనవచ్చు. విదేశాల నుంచి దిగుమతి చేసుకునే ముడినూనెనే గాక 'బొంబే హై' నుంచి వచ్చే ముడినూనెను కూడా ఇక్కడ శుద్ధి చేస్తారు. శుద్ధి అయిన నూనెలను రైలు, రోడ్ మార్గాల ద్వారా కాక, 513 కి.మీ. ల పొడవున్న పైప్‌లైన్‌ల ద్వారా జలంధర్‌కి పంపుతారు.

"మూర్ఖుడు కూడా శాంతంగా ఉంటే
వివేకి క్రిందే లెక్క!"
- ఓల్డ్ టెస్టమెంట్

(16 వ పేజీ తరువాయి)

గడ్డం కూడా కొంత తక్కువ స్థాయిలో అయినా ఈ కణాల నిరోధానికి తోడ్పడుతాయి. 3. ముక్కులోపల ఉండే శ్లేష్మం (mucus) అక్కడిదాకా వచ్చిన కణాలను అటకాయించడానికి తోడ్పడుతుంది. 4. ముక్కులో ప్రవేశించిన అలాంటి కణాలను బలవంతంగా బయటికి నెట్టివేసేందుకు జరిగే ఒక సహజ



ప్రక్రియ 'తుమ్ము'. 5. ముక్కు వెంట నీరు కారడం కూడా అలాంటి కణాలను బయటికి తోలేందుకు సాగే ప్రక్రియే! ఇన్ని రక్షణలున్నా తగినంత సంఖ్యలో ఈ కణాలు మనిషి దేహంలోకి పోవడం, వ్యాధులను కలిగించడం జరుగుతూనే ఉంది.

వ్యాధికారక కణాలు శరీరంలో ప్రవేశించకుండా జరిగే ఈ సహజ నిరోధక ప్రక్రియలను మరింత బలపరచేందుకు ముక్కుకు గాలి వడపోత సాధనం (nasal filter), 'ముఖం తొడుగు, (mask) లాంటి కృత్రిమ సాధనాలు ఉద్దేశించబడ్డాయి. గాలి వడపోత సాధనాన్ని ముక్కుపుటాల లోపల ధరిస్తారు. అందుచేత అవి పైకి కనిపించవు. కృత్రిమ దంతాల సెట్టు తయారీలో వాడే ప్లాస్టిక్ చట్రంలో అమర్చిన సన్నని స్టెయిన్‌లెస్ తీగెలవల ఈ వడపోత సాధనం. ఈ సాధనాలు మొదటిసారి 1974లో మార్కెట్‌లోకి వచ్చాయి. పదిమంది వ్యాపారస్థులు వీటిని ఉత్పత్తి చేసందుకు లైసెన్స్‌లు తీసుకుని వారిలో చాలా మంది అప్పుడే ఉత్పత్తి ఆరంభించారు. వ్యక్తికి తగిన సైజు 'ఫిల్టర్' (గాలి వడపోత సాధనం) ఎంచుకోడం చాలా ముఖ్యం. లేకపోతే అవి చాలా చికాకు కలిగిస్తాయి. రోగుల నాసారంధ్రాలలో వీటిని సాధారణంగా చాలా తేలికగానే అమరుస్తారు. కాకపోతే నాసారంధ్రాల మధ్య గల మాంసపు పొర (septum) బాగా వంపు తిరిగి ఉన్న రోగులకు మాత్రం వీటిని అమర్చేముందు ఒక మైనర్ ఆపరేషన్ అవసరం అవుతుంది.

చిన్నపిల్లల ముక్కులలో కూడా వీటిని అమర్చవచ్చును. కాని, పిల్లలు పెరిగి వారి ముక్కు సైజు కూడా పెరుగుతున్న కొద్దీ వీటి సైజును పెంచుతూ ఉండాలి. ఏడాదికీ, రెండేళ్ళకూ ఒకసారి అలా ఫిల్టర్‌లను మార్చవలసి రావచ్చు. ఈ ఫిల్టర్‌లోని తీగెవల చాల భాగం కణాలను వడపోసి వేయగలదు. వల తీగెలను తాకిన కణాలన్నీ నిరోధించబడతాయి. కాని ఆ తీగెలను తాకకుండా సందులలోనించి దూసుకుపోయే కొద్ది కణాలు మాత్రమే లోపలికి పోగలుగుతాయి.

## కొన్ని నిర్వచనాలు

| | |
|---|---|
| | లౌక్యులు అవలంబించేది! |
| చాడీకోరులు | వెన్నెముక లేనివారు! |
| సమానత్వం | గాలిలో మాత్రమే కనిపించేది! |
| వాన | ముఖం నల్లబడి, ఆకాశం చేసే రోదనం! |

"కథకుడిలో ఉత్సాహం ఉన్నంత వరకే కథ నడుస్తుంది!"

ఫిల్టర్‌లకు బదులు ముఖం తొడుగు (mask) ల ద్వారా గాలి పీల్చడం వల్ల కూడా ఈ కణాలు లోపలికి పోకుండా చూసుకో వచ్చును. మామూలు జేబురుమాలు లాంటి దాన్ని రెండు మడతలు వేసి ముక్కుమీదా, నోటిమీదా దానిని ఉంచి ఎలాస్టిక్ పట్టీలతో బంధించి 'ముఖం తొడుగు'ను తయారు చేసుకో వచ్చును.

ముక్కుకు గాలి వడపోత సాధనాలను రోగి స్వయంగా బయటికి తీసి మళ్ళీ అమర్చుకుంటూ ఉండవచ్చును. అయితే వీటిని ఎప్పుడూ సరియైన పొజిషన్‌లో అమర్చుకుంటూ ఉండడం చాలా ముఖ్యం. కుడి, ఎడమ ముక్కుల ఫిల్టర్‌లను తారుమారు చేయకూడదు.

ఈ ఫిల్టర్‌లలోని రంధ్రాలు అడ్డగించబడిన కణాలతో తరుచు పూడిపోతూ ఉంటాయి. అందుచేత రోజుకి ఒకటి రెండుసార్లు వాటిని శుభ్రపరచి మళ్ళీ ధరిస్తూ ఉండాలి. సబ్బు నీళ్ళతో వాటిని కడిగి పొడిగుడ్డ మీద అద్ద వచ్చును. ఫిల్టర్‌లలోని వలను సబ్బునీళ్ళలో ముంచిన బ్రష్‌తో శుభ్రం చెయ్యాలి. ఫిల్టర్ లోని వలను ఎప్పటికప్పుడు శుభ్రపరుస్తూ ఉండకపోతే రోగికి దానిద్వారా శ్వాపించడం కష్టం అవుతుంది. వెలుతురుకు ఎదురుగా పెట్టి చూస్తే వల శుభ్రపడిందీ, లేనిదీ తెలుస్తుంది. ఫిల్టర్‌లను ధరించి ఉన్నప్పుడు ముక్కుతోనే గాలి పీలుస్తూ ఉండడం అవసరం!

ఈ సాధనాలు వాడడం మొదలు పెట్టిన ఒక వారం రోజుల లోగానే 'అలెర్జీ' లక్షణాలు కనిపించడం తగ్గుతుంది. అయితే— ఈ సాధనం 'అలెర్జీ' నిరోధానికి తోడ్పడేదే కాని, ఇంతకు ముందే ఆ లక్షణాలు ఉంటే వాటి నిర్మూలనకు ఉపయోగించేది కాదని గుర్తుంచుకోవాలి. అలెర్జీ లక్షణాలు కనిపించ గానే డాక్టరును సంప్రదించి తగిన మందులు వాడడం అవసరం. ముక్కు వడపోత సాధనాలను గాని, ముఖం తొడుగులను గాని రాత్రింబవళ్ళు ధరించే వారిని భవిష్యత్తులో 'అలెర్జీ' లక్షణాలు కనిపించకుండా అవి కాపాడుతాయి!

---

## పొగ త్రాగడం మానేసేందుకు తోడ్పడే 'చూయింగ్ గమ్'




రష్యాలోని 11 ఔషధ సంస్థల వారు ఏకమై పొగ త్రాగడం మాని వేసేందుకు తోడ్పడే అద్భుతమైన క్రొత్త 'ఛూయింగ్ గమ్' తయారు చేశారు. లేత పసుపు వన్నెగా ఉండే ఈ 'గమ్' నారింజ, పొగాకు రుచులు కలిగి ఉంటుంది. ఇది వాడడం మొదలుపెడితే కొద్ది కాలంలోనే 'చెయిన్ స్మోకర్స్'కు కూడా పొగాకు వాసన అంటే గిట్టకుండా పోతుంది!

---

"పిరికి వారికి చరిత్రలో స్థానం లేదు!"

# కలం స్నేహితులు

(మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలూ ఈ శీర్షిక క్రింద ప్రచురించ బడా లంటే తగిన వివరాలతో సహా రూ. 5 లు మనియార్డరు ద్వారా పంపండి.—సంపాదకుడు.)

1. యెర్రమాడ రాజా, 21 సం.లు, ఇంటర్ విద్యార్థి, ఇం. నెం. 11 - 108, సీతారామపురం, మిర్యాల గూడ, నల్గొండ జిల్లా-508 207.

పాటలు వినడం, కలం స్నేహం, ఫొటోగ్రఫీ.

2. వి. నాగార్జున్, 21 సం.లు, శ్రీనివాస రేడియో హౌస్, సాగర్ రోడ్డు, మిర్యాల గూడా తాలూకా, నల్గొండ జిల్లా - 508 207.

పాటలు వినడం, పుస్తకాలు చదువడం, కలం స్నేహం.

3. జె శ్రీనివాసలింగం, 16 సం.లు. ఇంటర్ మొదటి సం.రం విద్యార్థి, s/o రాజా. ఇం. నెం. 5-2-186, స్టేషన్ బస్తీ, యెల్లందు, ఖమ్మం జిల్లా - 507 123

కవితలు వ్రాయడం, నటనపై ఆసక్తి, కలం స్నేహం.

4. సి హెచ్. ఆనంద్, 22 సం.లు, ఎమ్ బి.బి.యస్. రెండవ సం.రం విద్యార్థి, సిద్ధార్థ మెడికల్ కాలేజ్, విజయవాడ - 520 006.

స్టాంపుల సేకరణ, కలం స్నేహం, పుస్తక పఠనం.

5. డి.ఆర్. కృష్ణప్రసాద్, 24 సం.లు, ఎమ్. కామ్. ఇండియన్ బ్యాంక్, గ్రీమ్స్ పేట బ్రాంచి, చిత్తూరు - 517 002.

## ఇండియాలో రూ. 70 కోట్ల క్రీడా పరికరాల ఉత్పత్తి



ఇండియాలో ఆటలకు సంబంధించిన సాధన సామగ్రి ఉత్పత్తి సంస్థలు సుమారు 2,000 దాకా ఉన్నాయి. 60 000 మందికి జీవనోపాధి కల్పించడమే కాక, ఇవి దాదాపు రూ. 70 కోట్లు ఖరీదు చేసే సామగ్రిని ఏటేటా ఉత్పత్తి చేస్తున్నాయి. అయితే వీటిలో విదేశాలకు ఎగుమతి అయేది మన మొత్తం ఎగుమతులలో 2 శాతం మాత్రమే!

---

"ఇద్దరు అమ్మలక్కల కబుర్లు రెండు కుటుంబాలను సర్వ నాశనం చెయ్యగలవు!" —అరబ్బీ సామెత

ఫొటోగ్రఫీ, ప్రకృతి ఆరాధన, కలం స్నేహం.

6. కుమారి మాధవి. c/o వి. కృష్ణారెడ్డి, కొత్త ఉప్పలపాడు పోస్ట్ - 523 279. కందుకూరు తాలూకా. ప్రకాశం జిల్లా.

కలం స్నేహం, ప్రకృతి ఆరాధన, సంగీతం వినడం.

7. పి. శ్రీనివాస రెడ్డి, 22 సం॥లు, రసాయన విభాగం, విశ్వవిద్యాలయ కళాశాల, కాకతీయ విశ్వవిద్యాలయం,వరంగల్-506 009.

పత్రికలు చదువడం, రేడియో వినడం, పుస్తక పఠనం.

8. పి. శశిభూషన్ రావు, పాన్‌షాప్, మెయిన్‌రోడ్డు, ఆముదాల వలస-532 185.

మంచి సినిమాలు చూడడం, రేడియో వినడం, పుస్తక పఠనం.

9. పి. వెంకటేశ్వర్లు, కలం పేరు-'ప్రేమ్‌కుమార్': 20 సం.లు,బి.టెక్. 4/26, ఏ. యు. ఇంజనీరింగ్ హాస్టల్స్, వాల్తేరు-530 003.

సంఘసేవ, రేడియో వినడం, కలం స్నేహం.

10. ఎమ్. వి. బాలసుబ్రహ్మణ్యం, 20. సం.లు, బి టెక్., రూమ్ నెం. 5/86, ఏ.యు. ఇంజనీరింగ్ హాస్టల్స్, వాల్తేరు-530 003.

సంగీతం వినడం,ఫొటోగ్రఫీ, గేయాలూ, కథలూ వ్రాయడం.

11. మోదం భవాని, 8 వ తరగతి D/o శకుంతలా మల్లిఖార్జునరెడ్డి, జి. ప. హైస్కూల్, దామరమడుగు, నెల్లూరు జిల్లా.

పెద్దలను గౌరవించడం, విజ్ఞానం సేకరించడం. పుస్తక పఠనం.

12. బి. మహేష్, 16 సం లు., S/o బి. బలరామ్ పట్నాయక్, బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసర్, పాలకొండ, శ్రీకాకుళం జిల్లా-532 440.

క్రికెట్ కామెంట్రీ వినడం, స్టాంపుల, నాణేల సేకరణ.

## అందరికంటె ఎక్కువ వికెట్‌లు తీసుకున్న బౌలర్ !



ప్రపంచ సుప్రసిద్ధులైన క్రికెట్ ఆటగాళ్ళలో ఒకడైన ఆస్ట్రేలియెన్ బౌలర్ డెన్నిస్ లిలీ ఇటీవలే టెస్ట్ క్రికెట్ నుంచి విరమించారు. మొత్తం 355 వికెట్‌లు టెస్ట్ క్రికెట్‌లో ఆయన తీసుకున్నారు నగటున ఒక్కొక్క టెస్ట్‌కి 5 1 వికెట్‌ల చొప్పున ఆయన పడగొట్టారు. ఆయన ఆడిన ఆఖరు టెస్ట్ మాచ్‌లో 8 వికెట్లు తీసుకున్నారు.

"మిత్రులకు పరస్పర విశ్వాసం ఉంటే చావు బ్రతుకులు ఆలోచించరు." —చెనా సామెత

(8 వ పేజీ తరువాయి)

రికార్డు స్థాపించి 'గిన్నెస్ బుక్' లోకి ఎక్కిన భారతీయ మహిళ శ్రీమతి శకుంతలాదేవి. 76,86,36,97,74,870 ని 24,65,09,97, 45,779 తో హెచ్చిస్తే 1,89,476,68, 17,799.54,26,462 వస్తుందని కేవలం 28 సెకన్లలో ఆమె లెక్కకట్టి చెప్పింది.



* 'గిన్నెస్ బుక్' కెక్కిన మరొక భారతీయ గణిత శాస్త్ర మేధావి రాజన్ శ్రీనివాసన్ మహదేవన్. 1981 జూలై 5 న పై (π 22/7) విలువను 31,811 దశాంశస్థానాల దాకా గం. 3 ల 49 ని. లలో ఆయన లెక్కగట్టి చెప్పాడు.

* 'భారతీయ గాన కోకిల' లతా మంగేష్కర్ సోలోగా గాని, డ్యూయెట్‌లలో గాని, కోరస్‌లలో గాని మొత్తం 20 భాషలలో 25,000 పాటలు పాడి ప్రపంచ రికార్డు స్థాపించింది. మహమ్మద్ రఫీ (మరణం 1980) 1944-1980 మధ్య 11 భాషలలో 28,000 పాటలు పాడినట్లు చెబుతున్నారు.

* 1955 నుంచి 1973 దాకా 17 సం.ల పాటు ఏకబిగిని నిలబడి ఉండి, స్వామీ మావిగిరి మహరాజ్ కష్టసహిష్ణుతలో రికార్డు స్థాపించారు. నిద్రపోయేటప్పుడు కూడా ఒక చెక్కను అనుకుని నిలబడి ఆయన నిద్రపోయేవారు. ఈ విషయంలో ఆయన రికార్డ్‌ను అధిగమించడం అసంభవం కాకపోయినా, అతి కష్ట సాధ్యం అనక తప్పదు.

* భారతీయులు స్థాపించిన మరో అధిగమింపరాని రికార్డు 86 ఏళ్ళపాటు సాగిన దాంపత్య జీవితం. సర్ తేముల్‌జీ బికాజీ నారిమన్ తన 5 వ ఏట 1853 లో శ్రీమతి నారిమన్‌ని వివాహ మాడాడు. తేముల్‌జీ తన 91 వ ఏట 1940 లో మరణించే దాకా 86 ఏళ్ళ పాటు వారి దాంపత్యం అవ్యాహతంగా కొనసాగింది.

* జుట్టు పొడుగ్గా పెంచడంలో ప్రపంచ

(మిగ. తా 61 వ పేజీలో)

## ఇండియాలో రాజకీయ పక్షాల వైచిత్రి

సంభావ్యమైన, అసంభావ్యమైన రాజకీయ పక్షాలన్నీ ఇండియాలో కనిపిస్తాయి. ఒక దానితో ఒకటి దెబ్బలాడుకునే 8 కమ్యూనిస్ట్ పార్టీలు ఉన్న దేశం ప్రపంచంలో ఇండియా ఒక్కటే! అనుయాయులుండి నాయకులు లేని పార్టీలు, నాయకులుండి అనుయాయులు లేని పార్టీలు - ఇలా ఎన్నెన్నో రకాల రాజకీయ పార్టీలు చిత్రంగా ఇండియాలో మనకు కనిపిస్తాయి.

—శామ్ బెనెగల్ (మెయిన్ స్ట్రీమ్)

"మిక్కిలి ఒంటరిగా నిలబడే వాడే మిక్కిలి బలశాలి!" —ఇబ్సెన్

దున్నేందుకు భూమి,
ఉండేందుకు గృహం
ఇదే ఇరవై అంశాల
కార్యక్రమ మార్గం



# పోటీలు

జూన్ 1984

'విజ్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొనవచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీమీదా అడ్రసు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రు. 10 లు, రు. 7 లు, రు. 5 లు ఖరీదు చేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: జూన్ 20, 1984. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విజ్డమ్", 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

—సంపాదకుడు.

## వ్యాసం

'మంత్రాలకు శక్తి ఉందా?' అనే అంశం మీద 300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

---

## దక్షిణాది బాలురకు ధైర్య, సాహసాల అవార్డు



11 ఏళ్ళ వయస్సు గల తమిళనాడుకు చెందిన దిలీప్ క్రిస్టియన్, 15 ఏళ్ళ వయస్సు గల కర్ణాటక రాష్ట్రీయుడు కుమార్ పాండు రంగ 1983 జాతీయ ధైర్య సాహసాల అవార్డును అందుకున్నారు. దిలీప్ క్రిస్టియన్ విరిగిపడిన, ఒక చెట్టుకొమ్మను అందించి ఒక చెరువులో మునిగిపోబోతున్న 6 ఏళ్ళ బాలిక ప్రాణం కాపాడాడు. కుమార్ పాండు రంగ తన సహాధ్యాయి రైలు క్రింద పడకుండా రక్షించాడు.

"పై మెరుగులు మోసగిసాయి!"

## క్విజ్

1. కంచు ఎలా తయారు చేస్తారు: 2. 'పరిణామ సిద్ధాంతం' స్థాపించింది ఎవరు? 3. ఎక్కువ అనుభవం గలవాణ్ణి తెలుగులో ఏమంటారు? 4. 'శ్రీ కాళహస్తి' అనే పేరు ఎలా వచ్చింది? 5. బ్రాడ్ గేజ్ రైలు మార్గంలో రెండు పట్టాల మధ్య దూరం ఎంత ఉంటుంది? 6. భూమికి ఎన్ని ఉప గ్రహాలు ఉన్నాయి? 7. షణ్ముఖుడు ఎవరు? 8. 'అరున్' అవార్డు ఎవరి కిస్తారు?

## పజిల్




ఆధారాలు – అడ్డం: 1. వెండితెర కెక్కిన 'విశ్వనాథ' చారిత్రక నవల, 3. అర్జునుని ఒక భార్య. 5. సముద్రం, 6 తెలుగు roses, 8 చివరిలో తేలిపోయిన లలిత, 9. సత్యవంతుడు ఎవరి పతి?, 11. బ్రాహ్మణుని హత్య, 12. మార్గం, 13. ఒక కిరాతుడు సంహరింపబడే నాటకానికి పెట్టదగిన పేరు, 16. ఈ రోజులలో తెలివికా? వలువకా? దేనికి విలువ హెచ్చు, 18. 'తగదు'కి వ్యతిరేకం, 19. నారదుడు ఇచ్చిన పారిజాతాన్ని కృష్ణుడు ఎవరికి ఇచ్చాడు? 20. మాజీ ముఖ్యమంత్రి వెంగళరావు గారి ఇంటి పేరు.

నిలువు: 1. కాశీయాత్ర చరిత్ర వ్రాసిన వీరాస్వామయ్య ఇంటి పేరు, 2. రసవత్ కావ్యాలలో ఉండవలసిన తొమ్మిది ఏవి? 3. 'దేవాంతకుడు' 4. 'చిత్ర నళీయం' నాటకంలో నాయిక, 7. నిద్దరూపడానికి పాడే పాటలు, 9. శ్రీకృష్ణుని తమ్ముడు, 10. చిన్న నౌక, 12 అర్జునునికి కృష్ణుడు ఏమవుతాడు? 14. రాముని తమ్ముడా: 15. తెల్లనిది. 17. మొగలి పువ్వు.

---

## 'మనిషి' అనిపించుకునే అర్హత సాధించు!

"మనుష్యుల్లో మంచీ, చెడ్డా — రెండూ ఉన్నాయి. చెడు మాత్రమే చూసి ఎవ్వరినీ తూలనాడకు! నీ ప్రతిబింబాలే వారు అని గుర్తించి వారిని చక్కదిద్దేందుకు ప్రయత్నించు! 'ప్రేమ'తో వారిని దగ్గిరికి తీసుకో! 'మంచి' వైపుకు వారి దృష్టిని మళ్ళించు. అప్పుడే 'మనిషి' అనిపించుకునే అర్హత నీకు వస్తుంది.

—స్వామి బ్రహ్మానంద

"అన్యాయానికి 'తల ఒగ్గడం' కంటె
'తలపడడం' ఎక్కువ అవమానకరం!" —ప్లేటో

# తెలివికి పరీక్ష

1. తొమ్మిదిలో ఒకటి తీసేస్తే పది మిగులుతుంది - ఎలా?, 2. 23కి 9 కలిపితే దానిలోని అంకెలు తారుమారై 32 అవుతుంది. ఇలా 9 కలపడం వల్ల అంకెలు తారుమారయ్యే రెండంకెల సంఖ్యలు మరో రెండు చెప్పగలరా? 3 'ఒకానొక వర్ణానికి చెందిన పడుచు' అనే పేరు గల ఒక కీటకాన్ని చెప్పండి, 4. బేధము, భేదము, ఖేధము - వీటిలో ఏది రైటు? 5. 65, 68, 72, 77, 83, —, — ఈ వరుసలో తరువాతి 2 సంఖ్యలు చెప్పండి. 6. స, ధ, రి, ని, గ - ఈ వరుసలో చివరి స్వరం ఏది? 7. 'కొండ' చివర వచ్చే తెలుగు జిల్లా ఏది? 8. మన కళ్ళల్లోకి చూసి మాట్లాడలేని వాడు నిజాయితీ లేనివాడు - నిజమా? కాదా?

# మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను గుర్తించండి:

1. అక్షము: (ఏ) కన్ను, (బి) పాచిక, (సి) చక్రము, (డి) ఇరుసు.

2. అక్షరము: (ఏ) అక్షయ, (బి) వర్ణము, (సి) ఆకాశము, (డి) మట్టికోత.

3. అక్షి: (ఏ) కన్ను, (బి) శుక్రాచార్యులు, (సి) ఒంటి కన్ను వాడు, (డి) పాచిక.

4. అక్షౌహిణి: (ఏ) జూదపు పలక, (బి) సేనా విశేషము, (సి) దీపము, (డి) అక్షోహిణి.

5. అఖండము: (ఏ) ఒక ఖండము (బి) సంపూర్ణము, (సి) చిన్న ముక్క, (డి) ఎప్పుడూ ఆరకుండా వెలిగే దీపము.

6. అగచాట్లు: (ఏ) సాలెవారు, (బి) కంసాలులు, (సి) కష్టాలు, (డి) చాటున ఉన్న వస్తువులు.

7. అగజ: (ఏ) ఒక రకం ఏనుగు, (బి) పార్వతి, (సి) ఆకాశము, (డి) సీరు.

(57 వ పేజీ తరువాయి)



రికార్డు భారతీయునిదే: తంజావూరుకు చెందిన స్వామీ పండర సన్నిధి జుట్టు 1949 నాటికి 26 అ.ల పొడుగున పెరిగింది.

* పొడుగుపాటి మీసాలలోనూ రికార్డు భారతీయులదే! ఉత్తర ప్రదేశ్ రాష్ట్రానికి చెందిన మసూరియాదిన్ 102 అం. ల పొడవున మీసాలు పెంచాడు.

* చివరికి చేతి గోళ్ళ నిడివి విషయంలోనూ ఒక భారతీయుడే ప్రపంచ రికార్డు స్థాపించాడు. 'పూనె'కు చెందిన శ్రీధర్ చిల్లాల్ గోళ్ళు పాములాగ మెలికలు తిరుగుతూ సుదీర్ఘంగా పెరిగాయి. ఆయన గోళ్ల మొత్తం పొడవు 116¼ అం.లు!

"కష్టాలు వస్తే శరపరంపరలుగా వస్తాయి." - షేక్స్పియర్

8 అగడ్త: (ఏ) పొగడ్త కానిది, (బి) కందకము, (సి) ఇంటి చూరు, (డి) పరిఖ.

# విస్డమ్
## పోటీల కూపను
### జూన్ 1984

## ముఖచిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 ల ఖరీదు చేసే పుస్తకం బహుమతి.

## మీరైతే?
(ఏప్రిల్ 1984)

★

విస్డమ్ పత్రికకు ఎడిటర్ అయితే?

"14 భారతీయ భాషలలో 'విస్డమ్' విడుదలచేస్తా!"

—ఎం. దయమణి, బిట్రగుంట.

* * *

"'విస్డమ్' మాసపత్రికను వారపత్రికగా మార్చేస్తా!"

—శ్రీమతి బి. జానకి దేవి, హైదరాబాదు.




"రాజీవ్ గాంధీ స్థానంలో ఉంటే?" మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## భావపరిచయ పోటీ





8 మాటలకు మించకుండా పైన కనిపిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి వాటికి వర్తించేట్టు చమత్కారమైన లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

"తెలిసికోడం కాదు, ఆచరించడమే కష్టం!" —హూకింగ్

# పోటీలు (ఫలితాలు)

(ఏప్రిల్ 1984)

వ్యాసం - మొదటి బహుమతి: కాళంగి రాధాకృష్ణరావు, తువ్వ చలకరాయుడు పాలెం, ప. గో. జిల్లా: రెండవ బహుమతి: జయ విజయ, సాలూరు; మూడవ బహుమతి: డి. శేషుబాబు, కైకలూరు.

క్విజ్ - జవాబులు: 1. పిత్రార్జితం, 2. డాలర్, 3. విధి, 4. క్రికెట్ ఆటకు, 5. బ్రిటిష్ పాలన నుంచి భారత దేశం స్వతంత్రం అయింది (1947 ఆగస్టు 15), 6. (పాత) ఢిల్లీనగరంలో. 7. క్రికెట్ ఆటకు, 8. ఇరు పక్షాల స్కోరూ 40 కావడం.

విజేతలు - మొదటి బహుమతి: కుమారి బి. హెచ్. విశాలాక్షి. భట్టిప్రోలు; రెండవ బహుమతి: ఏ. ప్రమీల, తలుపుల, అనంతపురం జిల్లా: మూడవ బహుమతి: అరుణ ప్రభ, హైద్రాబాద్.

పజిల్ - జవాబులు అడ్డం: 1. నటరత్నం, 3. వినాయక!, 5. అప్రయత్నము, 7. ముఖారి, 8. లలాట, 9. భీరువులుగ, 10. ద్వారక, 11. కామిని, 13 రక్కసి మాయ, 16. తిరువూరు, 17. తండులాలు.

నిలువు: 1. నయనము, 2. త్నం, యప్ర, 3. వినూత్న, 4. కళ్ళకోట, 5. అరిభీకర, 6, ములగ కాయ, 10. ద్వావింశతి,

## జుట్టు పీక్కునే అలవాటు



"బట్టతల అయిపోయేదాకా ఊరికే జుట్టు పీక్కుంటూ ఉండే దురభ్యాసం ఏర్పడడానికి కారణం ఏ పనిలోనూ ఆసక్తి లేకపోవడం, తనలో తాను ముడుచుకొనిపోయే స్వభావం" అంటారు లక్నోలోని కింగ్ జార్జ్ మెడికల్ చెందిన డా. జితేంద్రకుమార్ త్రివేది. ఆయన దగ్గిరకు వచ్చిన కేసులలో మిక్కిలి దారుణమైంది—ఒక 40 ఏళ్ళ రోగి కేసు. అతని తలమీదే కాదు, శరీరం మీద కూడా ఒక్క వెంట్రుక లేదు. తల్లీ, భార్యా, సోదరుడూ, సోదరీ వెంట వెంట చనిపోవడం ఆ వ్యక్తి తన దేహం మీదనే దురాగతానికి పూనుకునేందుకు దారి తీసింది.

"ప్రార్థన వల్ల దేవుడు మారడు;
ప్రార్థించే వాడే మారుతాడు!" —క్లియర్కెగార్డ్

12. నివాళులు, 14. క్క,ట,రు, 15. మారుతం.

విజేతలు - మొదటి బహుమతి : తూను గుంట్ల కృష్ణమూర్తి, పొన్నూరు; రెండవ బహుమతి: వి. శ్రీదేవి, పిట్లం(నిజామాబాద్ జిల్లా); మూడవ బహుమతి: పిండిప్రోలి రామ సుబ్బారావు, హైద్రాబాదు-18.

తెలివికి పరీక్ష — జవాబులు: 1. గడ, 2. 77 (బ్రాకెట్‌కు కుడివైపు సంఖ్య నుంచి ఎడమ వైపు సంఖ్య తీసివేసి 2 తో భాగించాలి), 3. రాజు, 4. పరీక్షిత్తు (ఇతడు రాజు. తక్కినవారు ఋషులు),5. నిజంకాదు, 6. సర్వనామం, 7. వాల్మీకి, 8. వానరం.

విజేతలు - మొదటి బహుమతి: ఏ. రఘునందన్, బోర్లం; మూడవ బహుమతి: చలసాని సత్యనారాయణ, ఏలూరు.

మాటల మహిమ - జవాబులు: 1. పక్షి (బి), పాము (డి), 2. విఘ్నం (సి), 3. గర్భిణీ స్త్రీ (ఏ), చూలాలు (డి), 4. శిష్యుడు (బి), సమీపస్థుడు (డి), 5. అన్నం (బి), 6. కన్ను (సి), బాణం (డి), 7. ఆకాశం (బి), వస్త్రం (సి), 8. ఏనుగు మీది పీఠం (ఏ).

విజేతలు - మొదటి బహుమతి: జి. మనోజ్ కుమార్, హనుమకొండ; రెండవ బహుమతి: ఆర్. బాలపుల్లయ్య, రాయచోటి; మూడవ బహుమతి: వి. రాజశేఖర్, కడప.

ముఖచిత్ర వ్యాఖ్య - మొదటి బహుమతి: పి. శ్రీనివాసరెడ్డి, వరంగల్; రెండవ బహుమతి: ఏ. వి. ఎస్. ఎస్. శర్మ, అనకాపల్లి; మూడవ బహుమతి: బి. వి. ఎల్. నారాయణరావు, గుంటూరు.

పాఠకుల అభిప్రాయాలు - మొదటి బహుమతి: హెచ్. ఫణి, అనంతపురం; రెండవ బహుమతి: సుందరగిరి విజయ్ ప్రసాద్, వరంగల్.

మీరైతే? - మొదటి బహుమతి: యం. దయమణి, బిట్రగుంట; రెండవ బహుమతి: శ్రీమతి బి. జానకీ దేవి, హైద్రాబాదు.

భావ పరిచయపోటీ - మొదటి బహుమతి: చలసాని సత్యనారాయణ, ఏలూరు; రెండవ బహుమతి: మట్టా అప్పలస్వామి, దేవాది; మూడవ బహుమతి: టి. బాలకిషన్, బేతవోలు (నల్గొండ జిల్లా).

---

(4 వ పేజీ తరువాయి)

భ్రమించడం జరుగవచ్చును. తరువాత కాలక్రమేణ అతని నిజ స్వరూపం మీకు బట్టబయలు కావచ్చును.

దీనికి వ్యతిరేకం కూడా నిజమే! ఈ సందర్భంలో నాకో కథ జ్ఞాపకం వస్తుంది. ఆర్భాటంగా విలువైన దుస్తులు ధరించి ఉన్న ఒక పెద్దమనిషికి జేబులు తడుముకుంటే తన సిల్కు జేబురుమాలు కనిపించ లేదు. పక్కవాడితో "నువ్వే దానిని దొంగిలించావు" అన్నాడు. కొంత గలభా అనంతరం ఆ పెద్దమనిషి జేబులోనే ఆ జేబు రుమాలు కనిపించింది. అనవసరంగా తొందరపడి నింద వేసినందుకు పక్క వ్యక్తిని క్షమించమని అతడు కోరాడు. అప్పుడు ఆ పక్క వ్యక్తి ఏమన్నాడో తెలుసా? "ఫరవాలేదు లెండి! మీరు నన్ను 'దొంగ' అనుకున్నారు. నేను మీరు 'పెద్దమనిషి' అనుకున్నాను. ఇద్దరం పొరపాటు పడ్డాం!"

"గౌరవించలేని వాడు గౌరవం పొందలేడు!"

EDITED AND PUBLISHED BY K V GOVINDA RAO
AT No. 9, DESIKA ROAD, MYLAPORE, MADRAS-600 004. (INDIA).
PRINTED BY Mr. D. SRIDHARA RAO, AT KRANTI PRESS,
2, FRANCIS JOSEPH STREET, MADRAS - 600 001. (INDIA).
*COVER PRINTED BY SRI SHENBAGAM LITHO PRESS SIVAKASI.*